## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015097

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నీతిగాథలు

వెల అయిదణాలు.

వెలగపూఁడి దానయ్య చౌదరి.

# విషయసూచిక.







# దైవభక్తి

## (నందనారు)

గొప్పవారియందున్న ప్రేమయే భక్తి యనఁబడును. దేవునియందున్న భక్తియే దైవభక్తి.

దేవుఁడు సృష్టికిఁ గర్త. సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, ఆకాశము, భూమి, నీరు, గాలి, జంతువులు, వృక్షములు మున్నగు సమస్తవస్తువులను దేవుఁడే సృష్టించినాఁడు. కనుక దేవుఁడు మనకుఁ దండ్రి. మనమెల్లరము దేవునిబిడ్డలము. కావున మన మాయనను భక్తితో ధ్యానించుచుండవలయును. అట్లు నిరంతరము ధ్యానించుచున్నచో మనమనస్సులు నిర్మలము లగును. మన కానందము గలుగుచుండును. దేవునికి మనయందు వాత్సల్యము గలుగును. ఆయనదయ యున్నచో మనకు లభింపని దేముండును?

దేవుని ధ్యానించుటకు కులగోత్రములతోఁ గానీ, ఊరు పేరులతోఁగానీ, బలాబలములతోఁ గానీ, చిన్న-పెద్దతనములతోఁ గానీ, స్త్రీపుంసభేదములతోఁ గానీ, ధనదారిద్ర్యములతోఁ గానీ, యేమియు పనిలేదు. ఎవరైనను ఏస్థితిలోనైనను ఆయనను ధ్యానింపవచ్చును. ఈధ్యానమునందు మనము గమనింపవలసిన దొక్కటే విషయము. మనస్సును నిర్మలముగ నుంచుకొనుట; ఆయనయందే లగ్నముచేయుట. ఇంతియే కాని

వేషభాషలతో గాని, డాబుదర్పములతోఁ గాని, దేవుని మెప్పింపలేము. వానిచేత నతఁడు మోసపోఁడు. సర్వజ్ఞుఁడు గదా!

నిర్మలమగు దైవభక్తి గలిగినవారలలో నందనా రొకఁడు. ఇతనినివాసము ఆర్కాటుమండలములోని ఆదనూరు. ఆగ్రామమునఁ గల యొకమాలకుటుంబమున నీతఁడు జనియించెను. అతనిభాగ్యవిశేష మేమోకాని పసితనమునుండియు నతనికి దైవమునందు చక్కనిభక్తి గలదు. అతఁ డాడుకొను నాటలును దైవసంబంధములయిన వే; పాడుకొనుపాటలును దైవకీర్తనములే; తోడిబాలురవలె పనికిమాలినకుప్పిగంతులు వేయువాఁడు కాఁడు. లిల్లాయిపదములు పాడుట యతఁ డెఱుఁగఁడు.

బీదతనమునఁ బుట్టియుండుటచే పసితనము వదలిన వెనుక నతని నొకబాపనకాపునొద్ద జీతమునకుఁ బడవైచిరి. అతఁడు తనయజమానునికార్యముల నేమఱుపాటు లేక యొడలు వంచి నెఱవేర్చుచుండువాఁడు. అయినను మనస్సు మాత్రము నిరంతరము భగవానునియందే లీనమయియుండెడిది. ఇదియే యథార్థభక్తులలక్షణము. అతఁడు తనకు తీఱిక దొరకినపుడెల్ల కోవెలకు వెళ్ళి యాపరమేశ్వరునిదివ్యమూర్తిని సందర్శించి తనజన్మమును ధన్యముచేసికొన నువ్విళ్ళూరుచుండు వాఁడు. కాని యేదీ యాయవకాశము? కొన్నికులములవారిని గుడిలోనికి రానీయరుగదా! వారు దేవునిబిడ్డలు కారు గాఁబోలు! ఎట్టులైనను భగవంతునికి సేవచేయఁదలంచిన యాతఁడు

తన కవకాశము చిక్కినపుడు తిప్పెటలు పీరణములు చేసి గుడి దగ్గఱ వాయించుచుండువారి కొసంగి తాను సంతృప్తి నొందు చుండువాఁడు. ఇట్లతనిభక్తితోపాటు వయస్సును ముదురు చుండెను.

ఇటులుండఁగా నొకనాఁడు తమయూరికిఁ జేరువనున్న 'తిరుపంకూరు'లో తిరునాళ్ల జరుగుచున్నట్లు నందునికిఁ దెలిసెను. వెంటనే యతఁడుత్సాహమున కొంత యవకాశము కలిగించుకొని శరీరమునిండ విభూతి ప్రాముకొని, తోడివారిని గూర్చుకొని భజనచేయుచు నాగ్రామముఁ జేరెను. చేరి గ్రామమునకు ముమ్మాఱు ప్రదక్షిణముచేసి దేవళమునెదుటి కేగి 'హరహర మహాదేవ' యని కేకలు వేయుచు, వంగివంగి నమస్కరించుచు నానందమున తాండవ మాడుచుండెను. కాని యాతనికి ఆదైవమూర్తి కంటఁబడనే లేదు. ఆలయమునెదుట నున్న నందివిగ్రహ మాతనికి చాటయ్యెను. ఒక్కతాకరాని వాఁ డట్లు వచ్చి దేవునిగుడిముందట తమయెదుట భజనలు చేయుచుండఁగా కటకటపడుచున్న యగ్రవర్ణములవారు ఆతనికి దేవదర్శనము చేయింతురా? కాని భక్తవత్సలుఁడగు భగవానుఁడు మాత్ర మట్టిభక్తులకుఁ గానరాకుండ దాఁగుకొనఁడు. తనకు, భక్తునకు నడ్డముగనున్న నందివిగ్రహము నోసరించెను. భక్తుఁడు భగవంతునిమహిమను వేనోళ్ళఁ బొగడుచు కన్నుల కఱవుదీఱ నాదేవుని సందర్శించి సంతోషాతిశయమునఁ బులకాంకితుఁడై యొడలు మఱచి ధన్యుఁడయ్యెను. ఔరా! భగవం

తుని దీనదయాపరత! నాఁటినుండియు నా దేవాలయమునందలి నంది శివమూర్తి కెట్టయెదుట నుండక యొక్కప్రక్కకు ఒత్తిగిలియుండును.

ఎట్టకేలకు నందుఁడు తెలివిఁ దెచ్చుకొని భజనచేయుచు 'హర హర మహాదేవ' యని కేకలు వేయుచు మరల గ్రామమును చుట్టివచ్చుచుండెను. ఇట్లు తిరుగునప్పు డొకానొకపంచాదియరుఁగుపై నొకబ్రాహ్మణుఁడు పురాణము చెప్పుట గాంచెను. ఆవిప్రుఁడు ఆపురాణమునందలి 'చిదంబరక్షేత్రమాహాత్మ్యము'ను గూర్చి "చిదంబరక్షేత్రమును భక్తితో స్మరించినవారు పెక్కుపుణ్యము లొందుదురు. ఒక్కసారి యాక్షేత్రమును దర్శించిన మాత్రమున పాపములెల్ల పటాపంచ లగును. ఆక్షేత్రస్వామిని నటరాజమూర్తిని సందర్శించిన వారికి శాశ్వతకైవల్య మఱచేత నుండును" అనుచు వివరించుచుండెను. నందుఁ డీ మాటలను మహాభక్తితో చెవులు దోరగించి వినుచుండెను. ఆచిదంబరక్షేత్రమున కేగి యానటరాజమూర్తిని కనులారఁ గాంచి జన్మము తరింపఁజేసికొవలెనని యాతని కూహ కలిగెను. అయిన నింటికడ నెఱవేర్పవలసినపనులు పెక్కు లున్నవి. కనుక నెట్టులో యాయుద్రేకము నడఁచుకొని, భగవన్మహిమను సంస్తుతించుచు, ఆయనమూర్తిని సంస్మరించుచు, ఆయనగీతములను సంకీర్తించుచు నింటికిఁ జేరెను.

దేహము తమయూర నున్నను మనస్సుమాత్ర మత

నికిఁ జిదంబరముమీఁదనే యున్నది. 'చిదంబర మెన్నఁడు వెళ్లుదును! ఆస్వామిదర్శన మెన్నఁడు చేసికొందును!' అనియే యతనికలవరింత.

ఇట్లు కాలము నెట్టుచుండఁగా నింతలో నటరాజ స్వామియుత్సవము కలియుగవైకుంఠముగ జరుగుచున్నట్లు తెలియవచ్చెను. అతని కుబలాట మెక్కువయ్యెను. అచట నెప్పుడు వ్రాలుదునా యని తమకింపసాగెను. కాని యజమానుఁ డేమనునో! సెలవొసంగునో లేదో! అని వెంటనే సంశయ ముదయించెను. ఏమయిననేమి? ఈసమయము దప్పిన నుత్సవము మరల నెన్నాళ్లకో! అప్పటి కేది యెట్లగునో! అని తలంపు వొడమెను. తిన్నగా యజమానునిచెంగటి కేగి తన కోరిక విన్నవించుకొనెను.

కోఁతలరోజులు. కొన్నిచేలు కోఁత లయినవి. మరికొన్ని కోయవలసి యున్నవి. కుప్పలు వేయవలయును. ఇట్టిస్థితిలో జీతగానికి సెలవా? అందును పెద్దపెద్ద యయ్యవారలు తామంద యుండఁగా నీచెప్పరానివానికి చిదంబరయాత్రలా! సంపన్నులు జంజాటములలో క్రిందుమీఁ దగుచుండఁగా తిండికి లేనివారికి దేవపూజలా? ఎంతసాహసము!

యజమానున కొడలు జలదరిల్లినది. కన్ను లెఱ్ఱనయినవి. పెదవి కంపిల్లినది. 'ఓరీ చండాలుఁడా! నీకుఁదోడు తీర్థయాత్రలా? చండాలుఁడవుస్వామివయ్యెద వా? కూటికి లేకున్నను కోర్కెలకుఁదక్కువలేదే? చిదంబరము నీవులేక కళదప్పియున్న

దఁట? నటరాజు నీకొఱకు దిగులుపడినాఁడట! నీవులేక తిరునాళ్ల నిలిచిపోయినదఁట! ఈ మొగమునకు దేవోత్సవముకూడనా? తోడివారు పనిపాటులు చేసికొనుచుండఁగా నీకు తీర్థములు కావలసివచ్చినవి, వెళ్లినవెళ్లుము నాకేల? కాని యొక్కసంగతి. ఇంకను కొన్ని పొలములపైరు కోయవలసియున్నది. కొన్ని పొలములపైరు పోగుపెట్టవలసియున్నది. ఇవన్నియు నీవు చేయింపవలసినదే. వాన నమ్మరాకయున్నది. నీతాత మఱి యెవరును లేరుగదా పనిచేయుటకు? నీ పనులు పూర్తిచేసివెళ్ల వచ్చును. నాకేమియు నభ్యంతరములేదు.' అని పలికెను.

అంతవఱకు నిర్ఘాంతపడి నిలిచియున్న నందున కీచివరి మాటలు వినఁబడునప్పటికి అమృతము వర్షించినట్లయ్యెను. వాని హృదయ మొక్కసారి చిగిర్చినది. ఆశాలతలు కొనలు సాగినవి. వెంటనే యజమానునొద్ద సెలవుగైకొని పొలమున కేగెను. అతనియుత్సాహమునకు మేరలేదు. ఎక్కడినుండియో యతని కపరిమితమగు సత్తువ వచ్చినది. ఒక చేనివెనుక మఱి యొకచేను కోసివైచినాఁడు. ఇంతకుముందు కోసియున్న పొల ములలోని పైరునెల్ల కుప్పలువైచినాఁడు. ఆఁకలిగానీ, దప్పిక గానీ యతనికిఁ దోఁపలేదు. పొద్దు గ్రుంకుటయు, చీఁకటి పడుటయు నతఁడెఱుఁగనే యెఱుఁగఁడు. అలసటగానీ, శ్రమ గానీ యతనికిఁ గలుగలేదు. ఎట్లుచేసెనో యేమో ఒక్కఁడే- తోడైనలేకుండ- చేయవలసిన పనులన్నియుఁ బూర్తిగఁ

జేసివైచి, కాలుసేతులు గడుగుకొని యజమానునిగృహామునకు ఉఱుకులుపెట్టెను.

ఉదయమై నాలుగుగడియలపొద్దెక్కినది. నాఁడు కోఁత కోయింపవలసిన పొలములనుగూర్చియు, పొగుపెట్టింప వలసిన పొలములనుగూర్చియు యజమానుఁ డాలోచించుచుఁ గూరుచుండెను. ఇంతలో నందుఁడు వచ్చి యెదుట చేతులు నలుపుకొనుచు నిలువఁబడియుండెను. మొగమున నొకవింత కళ తొణకులాడుచుండెను. ఉత్సాహ ముబుకుచుండెను. ఆనాఁడు చేయవలసియున్న కార్యములను, విధానములను జెప్పుటకు వచ్చియుండునని యతఁడు భావించెను. కాని యాతనియుల్లాసమునకుఁ గారణము నతఁ డూహింపనేలేదు.

పనులన్నియుఁ బూర్తియగుట నాతనివలన నాలకించి యా బాపనసామి పొందిన యాశ్చర్యమునకు మితిలేదు. తాను వినుచున్న విషయములన్నియు సత్యములా! యనిపించినది. కాని నందుని మాటలయందు అనుమానపడఁదగిన యవసర మెన్నఁడును గలిగియుండలేదు. అతఁడబ్బురపాటుతో పొలము లకు బయలుదేఱెను. నందుఁడును వెంటనడువసాగెను. అట్లు వెళ్లి తన భూముల నన్నిటిని గాంచెను. సంతోషము హెచ్చి నది. ఆశ్చర్యము తలమునకలయినది. ఇదియంతయు నొక్క నందుఁడే చేసినాఁ డను తలంపు తోఁచినంతనే నందునియెడ గౌరవభావ ముదయించినది. వెంటనే యతఁడు నందునివైపు నకుఁ దిరిగి యిట్లుపలికెను. "నందా! నీయొద్ద నేదో మహిమ

యున్నట్లు గానవచ్చుచున్నది. ఈ పనులన్నియు నీ యొక్కని వలన నొక్కనాఁ డెట్లు పూర్తియయినవో తెలియకున్నది. సర్వశక్తిమంతుఁడగు భగవానుఁడే నీకుఁ దోడయి యీ పనులు నెఱవేర్చియుండును నిన్ను నిన్నటిదినము తూలనాడి యపరాధము చేసితిని. దానిని మఱచిపొమ్ము, నన్ను క్షమింపుము. నీవు చిదంబరమున కిప్పుడే వెళ్లవచ్చును." అని నమస్కరించి వీడ్కొని యింటి కేగెను.

నందనా రపరిమితానందముతో గంతులువైచుచు 'జయజయ శంకరసాంబగురో' యని పాటలు పాడుకొనుచు నట రాజస్వామిదర్శనమునకు బయలువెడలెను. అతనితోఁ బాటు మఱికొందఱును బయలుదేఱిరి. అట్లు భజనలుచేసికొనుచు చేసికొనుచు, నాక్షేత్రమును సమీపించిరి. నందుఁ డల్లంత దూరమునఁ గానవచ్చుచున్న గోపురములను చూచి యుబ్బి తబ్బిబ్బులగుచు, 'ఇదే చిదంబరము, అదే నా దేవుని గోపురము' అని కేకలువైవసాగెను.

క్రమముగ నూరు చేరెను. చేతులు జోడించి మహాదేవుని కీర్తించుచు నూరిని చుట్టివచ్చి దేవాలయముముందటి కేగి భక్తిపరవశుఁడై 'ఓ దేవా! నీదర్శనమీయవా! నీపుత్రుని దరిఁజేర్పవా! నన్ను రక్షింపవా! నిన్ను నేనెప్పుడు గన్నులారఁ గందును! నా జన్మమెప్పుడు తరియించును! శంకరా! శంభూ! ఈదీనునియందు దయరాదా!' అని పరిపరివిధములఁ బ్రార్థించుచుండెను. చుట్టునున్నవా రతనిభక్తిభావమున కచ్చెరువొందు

చుండిరి. ఇట్లు మూఁడు రేలుంబవళ్లు భగవన్మూర్తిని గాంచ నావేదనపడుచున్న నందునిం గాంచుచు నుపేక్షించిరి గాని దేవాలయములోని కాతనిం గొనిపోవకపోయిరి. ఆనాఁటిరేయి సాంబశివుఁ డాయాలయపుదీక్షితారులతోఁ గలలోనిట్లు పలికెను. "ఓయీ! నందనారు నా ప్రియభక్తుఁడు. అతనిని దేవాలయములోనికి రానిండు." ఆకలను వారు నిర్లక్ష్య మొనర్పఁజూచిరి గాని దీక్షితారుల కెల్లరతో నట్లు పలికియుండుటచే వారుపేక్షింప జంకిరి. తమలోఁ దాము సంప్రదించుకొని యా నందుఁ డగ్నిలోఁ బవిత్రుఁడయ్యేనేని లోనికి రానీయఁదగునని వారు నిశ్చయించి, నాఁటిపగలు రెండుజాములవేళ గనగనని నిప్పుల గుండము నేర్పఱచిరి. దానిలో మెల్లన నడచిరమ్మని నందునికిఁ దెలిపిరి. నందుఁ డందుల కంగీకరించి దేవుని భజించుచు నెట్టని యా చండ్రనిప్పులలో నెమ్మదిగ నడచి యొడ్డెక్కెను.

ఆ యర్చకులు ముక్కుపై వ్రేలు పెట్టుకొని యతనిని లోనికిం గొంపోయిరి. నందుఁ డాలయములోని కేగి యానట రాజమూర్తివిగ్రహముం గాంచి పెల్లుబుకుచున్న భక్తిరసమున మునుఁగుచు "నటరాజ! నటరాజ! నన్నుఁ గరుణింపుము. నీ యండకుఁ జేర్చుకొనుము." అని వేడుకొనుచు నా విగ్రహమును గౌఁగలించుకొనెను. అప్పుడొక వింతకాంతి యా యాలయమునందంతట నొక్కమాఱు తళుక్కున మెఱసెను. అటనున్నవారి కన్నులు మిఱుమిట్లుగొనెను. వారు

కన్నులు నులుముకొని యాశ్చర్యముతోఁ దేఱిచూచిరి. కాని నందుఁడు గానరాలేదు.

నందనారు మహాదేవుఁడగు నా నటరాజుమూర్తిలో నైక్యమయ్యెననియు, నా నటరాజు ఆ భక్తవరుని తనయం దైక్యమొనర్చుకొనెననియు వారు గ్రహించిరి. గ్రహించి తమకున్న యహంభావమును వీడి యా పరమేశ్వరునిభక్త వాత్సల్యమును, ఆ నందనారునిర్మలభక్తిని బ్రశంసించుచు గృహముల కేగిరి. భగవద్భక్తిచే తన సంసారబాధలనెల్లఁ దొలఁగించుకొని పరమేశ్వరునియందు లీనము కాఁగల్గిన నందనారుభక్తి మన కాదర్శముగాదా !

# మాతృభక్తి

## ( ఈశ్వరచంద్రుఁడు )

తల్లియే మనకుఁ బ్రత్యక్షదైవము; తల్లికంటె వేఱు దైవము లేదు. పుత్రుని బెంచుటకును గుణవంతుని జేయుటకును దల్లి యెన్నియో పాట్లు పడును. ఎంతయో ప్రేమమున నెన్నియో తెఱఁగుల కుమారునిశరీరమనో బలంబులు పెంపు సేయును. కావున మహోపకారిణియగు మాతృదేవి నెంతయో భక్తితో సేవింపవలయును. మాతృసేవ మానవుని పరమ

ధర్మము. ఈధర్మ మెఱింగినవారిలో "ఈశ్వరచంద్రుఁ" డొకఁడు.

ఈయన బంగాళా దేశమున కులీనబ్రాహ్మణవంశమున జనించెను. బీదకుటుంబమునఁ బుట్టియు మిక్కిలి పరిశ్రమ చేసి సంస్కృతమునఁ గావ్యములు అలంకారములు ధర్మశాస్త్రములు జ్యోతిషము మున్నగు విషయములందు సంపూర్ణపాండిత్యమును సంపాదించెను. సాగరమునఁగల నీటి కంతము లేనట్లీతఁడు గడించిన విద్య కంతము లేదు. ఇందువలననే యితఁడు 'విద్యాసాగరుఁ' డని బిరుదు పొంది యెల్లవారిచే నీశ్వరచంద్ర విద్యాసాగరుఁడని పిలుపించుకొనఁబడుచుండెను.

విద్యాసాగరుఁడైన యితని కధికారులు కలకత్తాయందలి యొక గొప్పకళాశాలలో నుపాధ్యాయపదవినొసంగి గౌరవించిరి. ఉద్యోగమున బ్రవేశించినది మొదలీశ్వరచంద్రునకుఁ గలకత్తానగరమే ముఖ్యనివాస మయ్యెను.

ఇట్లీతఁడు కలకత్తాయందుండి యుద్యోగ మొనరించుకొనుచుండ స్వగ్రామమున సోదరునికి వివాహము నిశ్చయము జరిగెను. పెండ్లికి రావలసినదని మాతృదేవి విద్యాసాగరునికిఁ గబురు పంపెను. కబురు వినినంతనే యతఁడు కలాశాలాధికారియొద్దకుఁ బోయి సంగతి నంతయుఁ జెప్పి 'యొకవారము దినములు సెలవు నిప్పింపుఁ'డని కోరెను. కలాశాలయందు పని యొత్తిడి యుంటచే నాయధికారి సెలవిచ్చుటకు వలనుపడ దనియెను. అపారమగు మాతృభక్తిగల యావిద్యాసాగరుఁడయ్యధి

కారితో 'అయ్యా! నాతల్లి నారాక కెదురు చూచుచుండును. నేనిపుడు పోకున్నచో నామె కంట నీరుబెట్టుకొనును. ఉద్యోగ మునకాసించి నే నామెనుదుఃఖపెట్టఁజాలను.నాకు సెలవొసంగు టకు వీలులేనిచో నుద్యోగమును మానుకొనిమెదను' అని వినయమునఁ బలికెను. అపు డా యధికారి యీశ్వరచంద్రుని మాతృభక్తికి సంతసించి "విద్యాసాగరా! నీమాతృభక్తి నాకానందముకలిగిఁచినది.కుమారుఁడవనిననీవే కుమారుఁడవు! తల్లికంటెనీ రొలుకునని యుద్యోగమును దృణప్రాయముగ నెంచితివి. ఇట్టినిన్నుఁగన్న తల్లియే తల్లి. ఆమెకు విచారమును గలిగించుట నాకును మంచిదికాదు. సెలవొసంగితిని. తోడనే యరిగి మీయమ్మ కానందమును గలిగింపు'' మనియెను.

అంత విద్యాసాగరుఁడు తల్లిని దలంచుచు నింటికిఁ బ్రయాణము సాగించెను. తమగ్రామము దరిదాపుగ పదునైదు మైళ్లదూర మున్నది ప్రొద్దు గ్రుంకినది. చీఁకటిరాత్రి. త్రోవ సరియైనదికాదు. మార్గమంతయు బురదచే నిండియుండెను. నడుమఁ గాలువలు. అయిననేమి? మాతృదేవియాజ్ఞ. ఎంత ప్రొద్దు పోయినను బోయితీఱవలయునని ఆచీఁకటిలో- ఆబుర దలో- అంతదూరము నడచి రాత్రి పండ్రెండుగంటల కతఁ డింటికిఁ జేరుకొనియెను.

ఆనాఁటిసాయంతనమే యింటఁ గలవారందఱుఁ బెండ్లికిఁ బోయిరి. ఈశ్వరచంద్రునికొఱకై తల్లిమాత్రమింటనే యుం డెను. కుమారుఁడు రానందులకామె యెంతయోవిచారించుచు

నెదురెదురుచూచుచుమంచమునఁగూర్చుండియుండెను. 'అమ్మా' యనుచు నీశ్వరచంద్రుఁడు తలుపుతట్టెను. కుమారునిపిలుపు వినఁగనే యామెకుఁ బ్రాణములు లేచివచ్చెను. వెంటనే తలుపు తీసి'నాయనావచ్చితివా'యని కుమారుని గౌఁగలించుకొనియెను. అప్పు డామెకుఁగలిగిన సంతసమునకు మేఱలేకపోయెను. తల్లినిఁ గాంచఁగనే విద్యాసాగరునకు మార్గాయాస మంతయుఁ దీఱిపోయెను. మాతృశ్రీయాజ్ఞ చెల్లించినందుల కతఁడు మిక్కిలి సంతసించెను.

ఆహా! ఏమి యీతనిమాతృభక్తి! మాతృదేవియాజ్ఞ మీఁద కితఁడనేకసత్కార్యము లొనరించెను. ఒకమాటు విద్యాసాగరునితల్లి తనచెంతినున్న యొక వితంతుబాలిక నతనికిఁ జూపి "నాయనా! నీవు చదివిన శాస్త్రము లేవియు నిట్టిబాలికల నుద్ధరింపఁ జాలవా?" అనెనఁట. అప్పుడతఁడు తల్లియాజ్ఞను శిరసావహించి ధర్మశాస్త్రములను బరిశీలించి యందుల కాధారములను గనుఁగొని తల్లిమానసమున కానందము గల్గించుటయే గాక దేశమునకును మహోపకార మొనర్చి కృతార్థుఁడయ్యెను.

ఇతఁడు పెద్దవాఁడై యపరిమితముగ ధనము నార్జించి పెక్కు ధర్మకార్యముల నొనర్చెను. మఱియుఁ దనకు దైవము వలెఁ బూజ్యురాలగు తనతల్లినామముతో తమయూరియందు బీదబాలుర కొఱకు ధర్మపాఠశాలను స్థాపించి నడపి తన మాతృభక్తిని వెల్లడించెను. ఇట్టి మాతృభక్తి యెల్లరకును నలవడునుగాక!

# పితృభక్తి

## ( చండుఁడు )

పుత్రుఁడు జనించినదిమొదలు పిత తన జీవితాంతము
వరకుఁ బుత్రుఁ డధికాయురారోగ్యముల నెగడవలయుననియుఁ
జదువులసరస్వతి కావలయుననియు సిరిసంపదలఁ దులదూఁగ
వలయు ననియు యశోవిరాజితుఁడు కావలయు ననియును
గోరికొనుచుండును. తనకోర్కు లీడేరుటకై యెన్నెన్నియత్న
ములనో కావించును. ఎందఱు దేవతలకో మ్రొక్కుకొనును.
వేయేల? తనజీవితసర్వస్వము నతనికి ధారవోయును. ఇట్టి
ధర్మము తండ్రికి సహజము. అట్లుగాక తండ్రి తన కొకవేళ
యనిష్టము గూర్చినను బుత్రుఁ డాతనియందు మిగుల భక్తి
గలిగి యుండుట యతనిముఖ్యధర్మము. పితృభక్తుఁడు సర్వవిధ
ముల సర్వలోకమందును బూజింపఁబడుచుండును.

పదునాల్గవ శతాబ్దమున మీవారురాజ్యమును లఘు
వను రాజేంద్రుఁడు పాలించుచుండెను. ఆతనికి చండసింగు,
రఘుదేవసింగు నను నిర్వురు పుత్త్రులు గలరు. వారు విశే
షించి శూరులును బుద్ధిశాలులును నీతిమంతులునై నెగడు
చుండిరి.

ఒకనాఁడు లఘుమహారాజు కొలువుదీఱియుండెను. అపు
డొక రాయబారి వచ్చి వానిపాదములపై నొక నారికేళ

ఫలమును బడవై చెను. రాజపుత్రస్థానమునం దా కాలమునం దమకూఁతు నెవని కైన వివాహార్థ మర్పింప నెంచినవారు పెండ్లి కొమరునిపాదములకడ కొక టెంకాయను బంపుట యాచారము. మార్వారుదేశపు రాజగు రణమల్లు తనకూఁతు రగు హంసను చందుని కీయ నెంచి ముందుగఁ దనదేశాచారము నిట్లు నడపెను.

చక్కనిచుక్క యగు హంసను బెండ్లియాడవలయు నను కోర్కి లఘురాజేంద్రున కింతకు మున్నే కలిగినది. కాని వయసుమీఱిన తనకు వారు పిల్ల నిత్తురా! యను సందియమున నాకోర్కి వెలిబుచ్చఁడయ్యెను. ఇపు డాకోర్కి తనకుఁ దా సిద్ధింపనుండె నని లఘువు లోలోన మురియుచుండెను. శుభలగ్ననిర్ణయపుఁ బత్రికకై యతఁడు నిరీక్షించుచుండెను. ఇట్లొక పదిదినములు గడచెను. "మా రాయబారి చేసినది పొరపాటు. హంసను నీనందనుఁ డగు చందుని కీయ నెంచితిమి కాని, నీ కీయఁ దలంపలేదు. చందునికిఁ హంసను జేసికొన నెంచితి రేని యయ్యది నాకుఁ దెలుపుఁడని రణమల్లు జాబు నంపెను. దానిని గాంచినతోడనే లఘుమహారాజు ఖిన్నుఁ డయ్యెను. తనయాశ యడియాస యైనందులకు నాఁడు మొదలు లఘురాజేంద్రుఁడు విచారమునఁ గ్రుంగిపోవుచుండెను.

ఈసంగతి చందునికిఁ దెలిసెను. పితృభక్తిపరాయణుఁ డగు చందుఁడు జనకునిస్థితికిఁ జాల చింతించెను. తండ్రి కోర్కి నెఱవేర్పఁ జేయవలయునని నిశ్చయించుకొనెను.

తోడనే మార్వారున కరిగి రణమల్లుని దర్శించెను. రణమల్లు సంతోషమునఁ జందుని గౌరవించెను.

పిమ్మట జందుఁడు "రాజా! నీవు నడపిన యాచారము ననుసరించి మాతండ్రికి హంసాదేవినొసఁగి పెండ్లి గావింపవా?" యని రణమల్లు నడిగెను. అందులకు రణమల్లుఁడు "చండ కుమారా! హంసను నీకీయవలయు నని యాచారము నడపితిని గాని, మీతండ్రి కీయవలయు నను తలంపున నడపలేదు. విధి వశమున నా యాచార మట్లు జరిగినది. ఏమిప్రయోజన మెంచి నేను మీతండ్రికి హంసనిత్తును? లఘురాజేంద్రునివలన హంసాదేవికి జనించినవాఁడు మీవారునకుఁ బ్రభుండగునా? అట్లెన్నటికిని జరుగదు. కావున నేను నీతండ్రికిఁ బిల్లనీయఁజాల. వలయునేని నీ కిచ్చెదను" అనియెను. తోడనే చండుఁడు "రాజా! ఎపుడు నాతండ్రిపాదములకడ టెంకాయ యుంచఁబడినదో యపుడే హంసాదేవి నాకుఁ దల్లియైనది. ఇంక నీ వా మాట నెత్తకుము. నడపిన యాచారమును ద్రోసిపుచ్చక హంసాదేవిని మాతండ్రి కొసఁగి వివాహమొనరింపుము. అట్లే హంసాదేవికి మాతండ్రివలన జనించినవానినే రాజుగా నొనరింతుము. అతఁడే మాకెల్లరకును బ్రభుఁడగును. ఇది ముమ్మాటికిని నిజము" అని రణమల్లునకు నచ్చఁబలికెను. అందుపై రణమల్లుఁడు లఘురాజేంద్రునకుఁ బిల్ల నిచ్చుట కిచ్చగించెను.

అనంతర మొక సుముహూర్తమున హంసాలఘురాజుల వైవాహిక మతివైభవోపేతముగ జరిగెను. కొన్ని

నాళ్లకా దంపతులకు ముకుళుఁడనుకుమారరత్నముదయించెను. ముకుళుఁడు పసివాఁడుగా నున్నపుడే లఘుమహారాజు వానిని విడచిపోవలసివచ్చెను. హిందువులపుణ్యక్షేత్రమగు ‘గయ’ను మహమ్మదీయులు పట్టుకొని నాశముచేయనున్నారలని లఘు నృపతికిఁ దెలియవచ్చెను. తా నా మహమ్మదీయులతోఁ బోరి గయను రక్షింపఁ దలంచెను. కాని, యాతురకలబారినుండి తప్పి యాలుబిడ్డలను దేశమును మరలఁ జూడఁగలనో లేనో యను సందియ మాతనికిఁ గలిగెను. తోడనే చండకుమారుని బిలి పించి తనపయిన మెఱిఁగించి "కుమారా! రణరంగమున కేఁగు నేను బ్రతికి వచ్చెదనో? రానో? ముకుళుఁడు పసివాఁడు. వాని నేమిచేయుదువో? భార మంతయు నీదే" యని పలికెను చేసిన ప్రతినల బీరువోసిక నెఱపు నాచండుఁడు "తండ్రీ! సందియ మొందకుము. ముకుళుఁడే మీవారు దేశమునకుఁ బ్రభుఁ డగును. ముకుళుఁడు గద్దె యెక్కినతోడనే నేను వానికి విధే యుఁడనై సర్వసహాయుఁడనై యుందును. అని సవినయుఁడై పలికెను. అందులకు లఘుమహారాజు మహానందభరితుఁడై నిర్విచారముగ గయ కరిగి రణరంగమున నిలచెను. ధైర్య మున మహమ్మదీయసేనావాహిని నెదిరించెను. పెక్కునాళ్లు తనశక్తికొలఁది వారితోఁ బోరాడెను. లెక్కకు మీఱిన యా మహమ్మదీయసేనల గెలువఁజాలక తుదకు రణరంగమున నిహతుఁడై వీరస్వర్గ మలంకరించెను.

లఘువు రణరంగమున నిహతుఁ డయ్యెనని తెలిసిన

తోడనే చంద్రుఁడు మీవారురాజ్యమునకు ముకుళుని నభిషే
కించెను. ముకుళుఁడు పసివాఁ డగుట నతని సింహాసనమున
కేవల చంద్రుఁడు తనపీఠమును వేయించుకొని యందుండి రాజ్య
పాలనమును గావించుచుండెను.

ఇట్లు కొన్నినాళ్లు జరిగెను. చంద్రుఁడు క్రమక్రమమున
బ్రజానురాగమును బడయుచుండెను. ప్రజానురాగముఁబడసిన
చంద్రుఁడు మున్ముందు తనకుమారునిసింహాసనమున కే దేని
ముప్పు గలిగించునేమోయను దురభిప్రాయమున హంసాదేవి
భయపడఁజొచ్చెను. హంసాదేవిదురభిప్రాయ మెట్లో చంద్రు
నికిఁ దెలిసెను. హంస కిట్టి దురభిప్రాయము కలిగినందుకు
ధర్మమూర్తియగు చంద్రుఁడు చాలఁ జింతించెను. ఎన్ని చెప్పినను
హంసాదేవి యింకఁ దన్ను నమ్మదని నిశ్చయించుకొని తన
యధికారమంతయు వదలుకొనెను. తోడనే తన్నెడఁబాయఁ
జాలనిమిత్రవర్గముతోఁగూడి చంద్రుఁడు దూరదేశముల కరిగెను.

చంద్రుఁడు చిత్తూరును విడచినతోడనే హంసాదేవి తన
హృదయశల్యము వాసెనని మిగుల సంతసించెను. వెంటనే
మార్వారునుండి తనతండ్రి యున్నగువారలఁ బిలిపించెను.
ఊషరక్షేత్రమన నొప్పు తనమారువారును విడచి రణమల్లు
సంతసమున కుమారవర్గముతోఁగూడి రత్నగర్భయగు చిత్తూరు
నగరమునకుఁ జేరెను. క్రమక్రమమునఁ దండ్రికుమారులెల్ల
రధికారములన్నియుఁ గరగతముగావించికొనిరి. అధికారమదో
న్మత్తులై వారు నానాఁటఁగావించు దుర్ణయములకు మితియే

లేకుండఁ బోయెను. రాజసభామంటపమున నొకనాఁడు పసి
వాఁడగు ముకుళుఁడు సింహాసనమునుండి దిగి నిలిచి యాడుకొను
చుండెను. ఆచిన్న రాణా గౌరవార్థ మెల్లరును లేచి నిలుచుండిరి.
కాని రణమల్లుమాత్రము తనయాసనమునుండి లేవఁడయ్యెను.
రాణా క్రిందనుండ రణమల్లు పీఠమునసుంట సభవారికిని వారి
కంటె రాణాయొక్క దాదికిని మనసుమంటగలిగించెను. తోడనే
దాది యంతఃపురమున కేగి రణమల్లుచెయ్దమును హంసా
దేవి కెఱిఁగించెను. తండ్రిచెయ్దమును హంసాదేవి సహింపలేక
పోయెను. ఆరాత్రియే తండ్రిని బిలిపించి చీవాట్లుపెట్టెను.
అందులకు రణమల్లుఁ గ్రుద్ధుఁడై హంసతో 'మే మాచరించెడి
కార్యములన్నిటికిని నొప్పికొని నోరుమెదల్పక పడియుండుము.
లేనిచో నీకుమారునిసింహాసనమునకే కాక ప్రాణమునకుఁగూడ
హాని రాఁగలదు. జాగ్రత్త!' యని ప్రత్యుత్తరమిచ్చి వెడలి
పోయెను. అందుపై హంసాదేవి తనకును దనపుత్రునకును,
నేమికీడు మూడునో యని భయపడఁజొచ్చెను.

ఇట్లుండ రణమల్లుం డొకనాఁడు తనసేవకులచే మోస
మున రఘుదేవుని జంపించెను. ఈవార్త తెలిసినతోడనే హంసా
దేవి మఱింత భయపడఁజొచ్చెను. సజ్జనుఁడగురఘుదేవుని దెగ
టార్చినవారలు ముకుళునిమాత్రము పరిమార్పకుందురా!
యని యామె తలంచెను. తగినంతతొందరలో రణమల్లు
మున్నగువారిని జిత్తూరునుండి తొలఁగింపవలయునని తలంచెను.
అందునకుఁ దగినశూరుఁడు చండుఁడే యని యామె నిశ్చ

యించుకొనెను. తోడనే తనను దనకుమారుని రాజ్యమును రక్షింపు"మని తగినవారితో రహస్యముగఁ జందునికి వర్తమాన మంపెను.

స్వధర్మనిరతుఁడగు చందుఁ డా వార్త వినినతోడనే తగిన యాలోచనము చెప్పి మున్ను తనవెంట వచ్చిన మిత్రులలోఁ గొందఱను జిత్తూరునకుఁ బంపెను. "ఏల వచ్చితి" రని వారి నిటఁ గొంద ఱడుగఁ "దాము చందునితోఁ జిరకాలము పెఱచోట నుండలేక వచ్చితి" మని వారు చెప్పిరి. వారి నెవ్వరు ననుమానింపక కోటఁ జొరనిచ్చి యెప్పటియట్ల యుండనిచ్చిరి.

చందునిమిత్రులు చిత్తూరుచేరినది మొదలు హంసాదేవి మిక్కిలి దైవభక్తిగలదానివలె దేవతలకు నుత్సవములు మున్నగునవి చేయింప మొదలిడెను. ఇట్లు కొన్ని దినములు జరిగెను. దీపావళిపండుగు వచ్చెను. ఆనాఁడు హంసాదేవి చిత్తూరునకుఁ గొంతదూరమునఁ గల "గోసుంద"యను గ్రామమున లక్ష్మీపూజఁ జేయించి గొప్పయుత్సవము గావించెను. దానిని దిలకించుట కను నెపమున హంసాదేవి ముకుళు నా సాయంతన మటకంపెను. ముకుళుఁ డాయుత్సవమును దిలకించి ప్రొద్దుపోయినవెనుకఁ దనపరివారముతో గృహాభిముఖుఁడై వచ్చుచుండెను. నాఁడు మిత్రులతోఁ జెప్పిపంపినరీతిఁ జందుఁ డా సమయమునకుఁ బ్రచ్ఛన్నవేషమున మఱికొందఱువిలుకాండ్రతోఁ గూడి ముకుళునిపరివారమునఁ గలిసెను. ఎల్లరును గోటలోఁ బ్రవేశించిరి. "ముకుళునిపరివారమే" యని వారి

నెవ్వ రనుమానింపరైరి. కోట ప్రవేశించినతోడనే మున్ను
తా నంపినమిత్రు లెల్లరును జందునకుఁ దోడైరి. ఎల్లరుంగూడి
యా నిశాసమయమున దుర్ణయులగు రాణిబందుగుల నందఱిఁ
బరిమార్చిరి.

ఇవ్విధంబునఁ జిత్తూరు దుర్ణయపరులగు నా క్రొత్త
ప్రభువులబారినుండి విముక్తిఁ జెందెను. రణమల్లునిపెద్దకుమా
రుఁడు జోడాయును నాతనిమిత్రులు కొందఱుదప్ప మార్వా
రువా రందరును హతులైరి. జోడా తనమిత్రులతోఁ గూడి
ప్రాణము దక్కించుకొన మార్వారునకుఁ బారిపోవ మొదలి
డెను. చండశాసనుఁడగు నాచందుఁడు వారి వెన్నంటి తరు
ముచుఁ బోయి హతమార్చి మార్వారునుఁగూడ స్వాధీనపఱచు
కొనియెను. చందుఁ డిట్లు విజయియై మీవారుమార్వారు దేశ
ముల రెంటిని తమ్మునిస్వాధీనపఱచి తనజీవితకాలమంతయుఁ
దమ్మునికి సహాయుఁడై కీర్తిగాంచెను.

బాలకులారా! చందుని పితృభక్తియు ధర్మతత్పర
తయు సత్యనిష్ఠయుఁ జూచితిరా! తండ్రికోర్కి దీర్చుటకై
రాజ్యమును ద్యజించెను. సత్యనిష్ఠకై పెక్కుపాట్లు పడి తమ్ముని
సింహాసనము నిలిపి యతని సేవించెను. పితృభక్తియన నిట్లుండ
వలయుఁగదా.

# గురుభక్తి

## (ఏకలవ్యుఁడు)

విద్య జెప్పెడువాఁడు గురుఁడు; గురుఁడు లేనివిద్య కూడదు. చతుష్షష్టివిద్యలలో నేవిద్య నేర్వవలయు నన్నను గురుఁ డుండవలయును గురుభక్తి యుండవలయును. గురుని యందలిభక్తి గురుభక్తి. గురుభక్తిలేని శిష్యుఁడు వ్యర్థుఁడు. విద్య యను సంద్రమును దాఁటుటకు గురుభక్తి యొక పెద్ద నావ. గురుభక్తిగల్గు నాతఁ డెట్టికోర్కెల నైనను సిద్ధింపఁ జేసికొనఁగలఁడు.

పూర్వ మింద్రప్రస్థపుర సమీపారణ్యమున హిరణ్యధన్వుఁ డను నొకయెఱుకు నివసించుచుండెను. వాని కొక నందనుఁడు గలఁడు. అతఁడు మిగుల కుశాగ్రబుద్ధి; కడు గుణవంతుఁడు; విద్యార్జనాసక్తుఁడు, ఆతని పే రేకలవ్యుఁడు. ఏకలవ్యునకుఁ దమకులవిద్యయగు బాణవిద్యను బరిపూర్తిగా నేర్వవలయు నను కోర్కె యొదవెను. అస్త్రవిద్యాపాండిత్యగరిమ నందుట కెవరి నాశ్రయించు టుత్తమమా? యని వితర్కించుకొనియెను. కౌరవ పాండవుల కస్త్రవిద్యాగురుండగు ద్రోణు నాశ్రయించుటే మే లని నిశ్చయించుకొనెను. వెంటనే బయలుదేరి హస్తిపురి కరిగెను. ద్రోణుని దర్శించి నమస్కరించి వినమ్రుఁడై నిలిచెను. ద్రోణుఁ డతనిం గాంచి

"ఎవ్వండవు? ఎందులకై యిట కరుగుదెంచితి" వని యాతని
నడిగెను. అందుల కేకలవ్యుఁడు "గురూత్తమా! నే నొక
బోయను. నా కస్త్రవిద్యాభ్యాసమునం దభిలాషము కలదు.
మిమ్మాశ్రయించి యా యభిలాషముం దీర్చికొనవచ్చితి;
ననుగ్రహమున నస్త్రవిద్యను నేర్పు" డని ప్రార్థించెను.
ద్రోణుఁడు వాని ప్రార్థనమును ద్రోసిపుచ్చెను. "ఓయీ! నీవు
శూద్రజాతివాఁడవు; శూద్రునకు వేదవిద్యాధ్యయనము కూడదు;
కావున మేము నీకు ధనుర్వేదమును జెప్పనొల్ల" మనియెను.
ఆపల్కులు వినినంతనే యేకలవ్యుఁడు మొగము చిన్నబుచ్చు
కొనియెను. 'గురూ! కులహీనుఁడ నైనంతమాత్రమున విద్యా
గ్రహణమునకుఁ దగినవాఁడను గానా? నాయభిలాషముం
దీర్పరా? అనుగ్రహ ముంచరా?' యని మఱియుం బ్రార్థిం
చెను. కాని లాభము లేకపోయెను.

అస్త్రవిద్య నభ్యసింపవలయు నను పట్టుదలయు
నున్నది. ద్రోణునికడనే యావిద్య నభ్యసింపవలయు నను
కోర్కెయు నున్నది. కాని యాతఁడు తిరస్కరించెను. ఏకలవ్యు
డిఁక నేమిసేయును? గుణవంతుఁడగు విద్యార్థి యెన్నియభ్యం
తరములు కలిగినను దనప్రయత్నమును మానునా? ద్రోణు
నిపై గురుభావ ముంచి యేకలవ్యుఁడు నిజోద్యోగమునకుఁ
గడంగెను. వనమధ్యమునకుఁ బోయెను. మంటితో నొక్క
బొమ్మను జేసెను. దానికి ద్రోణుఁ డని పేరుపెట్టెను. అటఁ
గల చెట్టుమొదట నొకచిన్న గుడిసెను నిర్మించెను. అం

దీ ద్రోణప్రతిమను నిలిపెను. ఆబొమ్మయే ద్రోణుఁ డనుకొని భక్తితో నిత్య మద్దాని నర్చించుచు బాణవిద్య నభ్యసింప మొదలిడెను. భక్తితోఁ జేసినపని ఫలితార్థత నొందకుండునా? శీఘ్రకాలముననే యేకలవ్యుఁడు ధనుర్విద్యాపారంగతుఁ డయ్యెను. ద్రోణుండు స్వయముగా నేర్పినవారికంటె మొనకాఁ డయ్యెను.

ఇట్లుండ నొకనాఁడు కౌరవులును బాండవులును వేఁటాడుటకునై యేకలవ్యుఁడున్నయడవికి వచ్చిరి. వారు వేఁట కుక్కల వెంటనిడుకొని క్రూరమృగములఁ గొట్టుచు హింసించుచు నాయరణ్యమునఁ బడి పోవుచుండిరి. వారివెనుక నరు దెంచునప్పుడొక వేపి యార్తధ్వని గావించెను. కారణ మరయ నెంచి వెనుదిరిగి వారాకుక్కరమును బరీక్షించిరి. దానియొడల నొకబాణము నాటఁబడియుండెను. "ఈనిర్జనారణ్యమున నెవ్వఁ డిట్లు కావించియుండునా?" యని వా రాతని వెదుకఁజొచ్చిరి. వెదకివెదకి కొంతదూరమున బాణప్రయోగమును నెఱపుచున్న యొక యెఱుకును జూచిరి. అతఁడే తమకుక్కను గొట్టియుండనోపునని తలంచిరి. "కాని ఇంతదూరముననుండి యిన్ని చెట్లచాటుననున్న కుక్క నీతఁ డెట్లుకొట్టఁగలిగెనా" యనిసంశయించిరి. అయినఁ గానిమ్మని వానికడ కేగిరి. తోడనే వారిని జూచి యేకలవ్యుఁడు నమస్కరించెను. నిజమైనద్రోణుఁడు తన యెదుట సాక్షాత్కరించినందుల కతఁడు భక్తిభావమున నుప్పొంగిపోయెను. ధన్యుఁడనైతినని తలంచెను. రాజకుమారులం

దర్జునుఁ డాబోయం గాంచి "ఓయీ! నీవేనా మా యీశునక మును గొట్టిన విలుకాఁడ? వని యడిగెను. అందుల కాతఁడు స్వామీ! నేనే కొట్టితిని. "అడవియందు తిరుగుకారుకుక్క గదా" యను తలంపున నానేర్చినశబ్దవేధిలక్ష్యమును సరి జూచుకొంటిని క్షమింపుఁ" డనియెను. అతని శబ్దవేధిత్వము నందలిసేర్పునకు వా రంద ఱాశ్చర్యమున మునిఁగిపోయిరి. ఏమియుం బలుకక కొంతసే పట్లే నిలిచియుండిరి. పిదప నర్జునుఁడు మెల్లగా "నీపే రెయ్యది? నీ వీధనుర్విద్య నెవ్వరి కడ నేర్చితి"వని యాబోయ నడిగెను. 'అయ్యా! నాపే రేకలవ్యుఁడు.' మీకెల్లరకు గురుఁడై యస్త్రవిద్య నేర్పుచున్న పూజ్యపాదులగు నీద్రోణభగవానులే నాకును గురువులు" అని యాతఁడు బదులుచెప్పుచు వినయమున ద్రోణునికి నమస్కరించెను. ద్రోణుఁ డేకలవ్యునిఁ జూచి "నేను నీకు గురుఁడ నెట్లయితి" నని యడిగెను. వాఁ డందులకు మంటితో నిర్మించియుంచిన తన పూజావిగ్రహమును గురు నకుఁ జూపుచు, "దేశికేంద్రా! నాఁడు తమయొద్ద ధనుర్విద్య నభ్యసింప నేతెంచి తమచే నిరాకృతుఁడనై తమయాకృతి నిట్లు నిల్పికొని యర్చించుచు విద్యనభ్యసించితిని. ఇది యంత యుఁ దమయనుగ్రహమే" యని వినయమున వచించెను. ద్రోణుఁడు వాని గురుభక్తికిని బట్టుదలకును మిగుల సంత సించెను.

అపు డర్జునుఁడు ద్రోణు నాంచి "గురువర్యా! విలు

కాండ్రిలో నిన్ను మొనకానినిగా సలుపుదునని నాఁడు నాతో మీ రంటిరికదా? ఇపు డేకలవ్యుఁడు నాకంటెను విలువిద్య యందు గొప్పవాఁడై యున్నాఁడే? దీని కేమందురు? మీపలి కినపలుకులు నిలుపుకొనరా?” యని దీనముగ ననియెను. ఆపల్కులకు ద్రోణుఁడు కొంతతడ వాలోచించి యాతని కోర్కి దీర్పవలయుననితలంచి యేకలవ్యునిఁగాంచి చిఱునగవుతో నిట్లనియెను. “ఓయీ! నన్నుఁ బూజించికదా నీవు శరవిద్య నేర్చుకొంటివి? ఇందులకు గురుఁడనైననాకు నీవు గురుదక్షిణ నీయవలదా? అని యనెను. “ఆచార్య! ఇవియే నాకుటీరము. ఇవియే నాధనుస్తూణీరములు. ఇదిగో నాశరీరము. ఇందేది మీకు వలయునో సెలవిండు. సంశయింపక సమర్పించెద” నని యాయేకలవ్యుఁడు భక్త్యుత్సాహము లినుమడింప గురునితో ననియెను. తోడనే యాచార్యుఁడు ‘నీకుడిచేతిబొట్టనవ్రేలి నిమ్మని’ యడిగెను. గురుఁడు గోరుటయే తడవుగా నేకలవ్యుఁడు పదనైనబాణమునఁ దనకుడిచేతిబొట్టనవ్రేలిని ఖండించి నెత్తుటఁ దడిసిన దానిని భక్తితో ద్రోణుని దోయిలియం దిడి నమస్కరించెను. గురుఁడు సంతసించి శిష్యుని దీవించెను. రాజకుమారులును బోయనిగురుభక్తిని బ్రశంసించిరి. పిమ్మట నేకలవ్యునివీడ్కోలుతో గురుశిష్యులు హస్తిపురి కరిగిరి.

చూచితిరా! ఏకలవ్యుఁడు! మంటితో బొమ్మను జేసి యామంటిబొమ్మయే గురుఁడని నమ్మి పూజించి గొప్పవిలువిద్య నార్జించి విలుకాండ్రిలో మొనగాఁడయ్యెనుగదా? ఆహా!

ఏమి యాతనివిద్యార్జనాసక్తి! ఔరా! యేమి యాతనినిశ్చల మైన గురుభక్తి! బాలురారా! మీరును గురుభక్తిగలవారై యుండుడు. ఆసక్తితో విద్యనార్జించుడు. ఆచార్యులమెప్పును బడయుడు.

# ప్రభుభక్తి

## ( చాందభట్టు )

పెద్దలు "నా విష్ణుః పృథివీపతిః" అని చెప్పిరి. అనఁగా "భగవంతుఁడుకానివాఁడు రాజు కాఁడు. రాజునందు భగవంతునియంశ ముండును. అని దీనియర్థము. కావుననే భారతదేశీయులు తమయేలికను దేవునివలె భావింతురు. అతనియందు విశేషమగుభక్తిని జూపెదరు. అతనికొఱకు నెట్టిత్యాగముల నైనఁ గావింతురు. అట్టివారిలో "చాందభట్టు" అనువాఁడు సుప్రసిద్ధుఁడు.

పండ్రెండవ శతాబ్దియందు హిందూదేశమునందలి యజ్మీరురాజ్యమును బృథ్వీరాజు పాలించుచుండెను. కన్యాకుబ్జమును జయచంద్రుఁ డేలుచుండెను. వీరిరువురును అక్కచెల్లెండ్రబిడ్డలు. వీరిమాతామహుఁ డనంగపాలుఁడు. ఇతనికిఁ బుత్రులు లేరు. కాన నితఁడు తనఢిల్లీరాజ్యమును బృథ్వీరాజున కొక్కనికే యిచ్చి మరణించెను. నాఁటినుండియు జయ

చంద్రునకుఁ బృథ్వీరాజుపై నసూయ కల్గెను. అతని నెట్లయిన నోడింపవలయునని జయచంద్రుఁడు తలంచుచుండెను. అతఁడు తనయెడఁ గావించుచున్నకుట్రను పృథ్వీరాజు తెలిసికొనెను. నాఁటినుండి యతఁడును జయచంద్రునిపైఁ బగబూని యుండెను. ఈయిద్దఱ కలహములే భారతమాతకు భరింపరానికష్టములను దెచ్చిపెట్టినవి. ఆమెగౌరవమును స్వాతంత్ర్యమును నాశముచేసినవి. ఆమె బానిసయై యల్లాడుటకుఁ గారణములైనవి.

జయచంద్రుఁడు 'పృథ్వీరాజునెప్పుడు జయింతునా'యని యువ్విళ్ళూరుచుండెను. ఆపని తనయొక్కనిచే సాధ్యము కానేరదని యతనికిఁ దోఁచెను. కాన నతఁడు పరుల సహాయము కోరవలసివచ్చెను. హిందూరాజులలో నొకరిద్దఱు తప్ప తక్కినవారు పృథ్వీరాజు నెదుర్కొనుటకు సాహసింపలేక పోయిరి. కావున జయచంద్రుఁడు పరదేశీయుల బాసట సంపాదింపనెంచెను. ఇది కేవలము నిందింపఁదగినకార్యముగదా!

హిందూదేశమునకు నుత్తరమున మంచుకొండకు నావల తుర్కిరాజ్యము కలదు. దానిని మహమ్మదీయులు పాలించుచుండిరి. మనకథాకాలమున నారాజ్యమునకు "శహాబుద్దీన్ ఘోరి" అనువాఁడు రాజు. ఇతనినే మహమ్మదుగోరీ యనియుఁ బిలుతురు. ఇతఁడు సమస్తసంపదలకు నిలయమైన హిందూదేశము నాక్రమింపవలయునను కుతూహలముతో నుండెను. అట్టిసమయముననే జయచంద్రుఁ డతనిసాహాయ్యము

వర్ధించెను. కాన గోరీ చంకలుకొట్టుకొనుచు మహాసైన్యముతో వెడలివచ్చెను. జయచంద్రుఁడు గోరీసహాయముతోఁ బృథ్వీరాజుపై దండయాత్ర సాగించెను. అతఁడు ప్రారంభించిన పనికి దేశమునందలిరాజు లాగ్రహించిరి. పెక్కురు పృథ్వీరాజుపక్షమునఁ జేరిరి. ఉభయసైన్యములకును భయంకరమైన సంగ్రామము జరిగెను. పృథ్వీరాజునకే జయము సిద్ధించెను. కొండంతయాసతో వచ్చిన గోరీని బృథ్వీరాజు బంధించి చెఱయం దుంచెను. కాని యతఁడు క్షమాపణ కోరుటచే వెంటనే విడచిపెట్టెను.

గోరీ తనదేశమునకుఁ జేరెను. ఈపరాభవ మతనికి గుండెలలో గాలమయ్యెను. పృథ్వీరాజుపై మరల నాఱుపర్యాయములు దండెత్తివచ్చెను. కాని యెప్పుడును విజయలక్ష్మి పృథ్వీరాజునే వరించుచుండెను. నీతిశాలియగు పృథ్వీరాజు గోరీని బెక్కుసారులు బంధించియు నతఁడు బతిమాలుకొనుటచే మరల విడచిపెట్టుచుండెను. ఇట్లు నిరంతరమును దమప్రయత్నము విఫలమగుటచే గోరీజయచంద్రులు కొన్నాళ్లు మిన్నకుండిరి.

ఇంతలో జయచంద్రునిపుత్రికయగు సంయుక్తకుఁ బెండ్లియీడు వచ్చెను. ఆమెస్వయంవరమునకు జయచంద్రుఁడు భూపాలురనెల్లరిని నాహ్వానించెను. కాని పృథ్వీరాజును బిలువఁడయ్యెను. పైపెచ్చు పృథ్వీరాజుబొమ్మను వాకిట వ్రేలాడఁగట్టెను. సంయుక్త యా బొమ్మనే వరించి దానిమెడలోఁ

బూలమాల వైచెను. అపుడు జయచంద్రునకుఁగల్గిన యవమానము దుర్భరముకదా! అతఁడు సంయుక్తపై మండిపడి యామెను కారాగృహమునఁ బెట్టెను. ఈ వార్త వెంటనే పృథ్వీరాజునకుఁ దెలిసెను. తన్నుఁ బ్రేమించి గౌరవించిన సంయుక్తను జెఱనుండి తప్పించుట ధర్మమని యెంచి యతండు వెంటనే సైన్యసమేతుఁడై కన్యాకుబ్జము చేరెను. ఈ వార్త సంయుక్త యెఱింగెను. ఆమె నాఁటిరాత్రి తన చాకచక్యముచేఁ జెఱనుండి తప్పించుకొని పురుషవేషము ధరించి యశ్వారూఢయై శరవేగమున వచ్చి తన హృదయేశ్వరుని జేరెను. పృథ్వీరాజామెను మిగుల నాదరించెను. తెల్లవారఁగనే యుభయ సేనలును యుద్ధమునకుఁ దారసిల్లెను. పోరు ఘోరంబుగా సాగెను. పృథ్వీరాజు స్వయముగాఁ దనసేనలను నడపెను. తుద కతఁడే విజయమునందెను. తదనంతర మతండు సంయుక్తతోఁ గూడి ఢిల్లీనగరము చేరి యామెయం దధికానురాగంబు చూపుచు భోగపరాయణుఁడై రాజ్యవ్యవహారములయందు శ్రద్ధలేక యుండెను. ఇంతలో దురదృష్టవశమున నతనికిని అతని సేనాపతికిని నభిప్రాయభేదములు వచ్చెను. ఢిల్లీశ్వరుఁడు సేనాధిపతిని దనకొలువునుండి వెడలనడచెను. సర్దారీ పరాభవమును భరింపలేక పోయెను. ఎట్లయినను బగ తీర్చుకొనవలయునని తలంచి జయచంద్రునిపక్షమునఁ జేరెను. జయచంద్రుని సంతోషమున కపుడు మేరలేదయ్యెను. అతఁడు వెంటనే గోరీని సైన్యసమేతముగా రావించెను. మరికొందఱు రాజపుత్రులును

దేశద్రోహులై గోరీకిఁ దోడ్పడిరి. పృథ్వీరాజునకును బెక్కండ్రు రాజులు సాయపడిరి. ఇరువాగులవారికిని స్థానేశ్వరముచెంత మహాయుద్ధము సాగెను. పృథ్వీరాజుసైనికులు సాటిలేని శౌర్యముచూపిరి. కాని యీసారి జయలక్ష్మి మహమ్మద్‌గోరీని వరించినది. భారతదేశమునకు దుర్దినములు వచ్చినవి. కటకటా! హిందూచక్రవర్తియగు పృథ్వీరాజు గోరీచేతఁ జిక్కెను. అతని కాలుసేతులకు సంకెలలు వేయఁబడినవి. ఢిల్లీపతి వంచినతలతో "నన్ను విడువుము" అని గోరీని కోరెను. నీతిశూన్యుఁడు, దయారహితుఁడునగుగోరీ యతనిని మన్నింపకపోవుటేగాక కన్నులు తోడించి కారాగృహమున నుంచెను. ఢిల్లీసింహాసనముపై గోరీ వెలిఁగిపోవుచుండెను. జయచంద్రుఁ డతనికి మంత్రియై యుండెను. కాని కొన్నాళ్లకు గోరీ జయచంద్రునిరాజ్యము లాగికొనెను. ఈయవమానము భరింపలేక జయచంద్రుఁ డేటిలోఁ బడి చచ్చెను. దేశద్రోహుల కిట్టిశిక్ష యుచితమే కదా!

పృథ్వీరాజు బోనులోనున్న సింగమువలెఁ గృశించుచుండెను. అతనికీకష్టదశలోఁ దోడ్పడినమహాపురుషుఁడే చాందభట్టు. అతఁడు పృథ్వీరాజున కాస్థానకవియై, మంత్రియై పేరందినవాఁడు. తనరాజిట్టియిక్కట్టులపాలయ్యెఁగదా యని యతఁడెంతయుఁ జింతించెను. ఏయుపాయముచేతనైన నతనిమానమును గాపాడవలయునని భట్టు నిశ్చయించుకొనెను. మెల్లగా నతఁడు గోరీదివాణము నాశ్రయించెను. మధురమైన తన

కవితాధారచేఁ దురుష్కచక్రవర్తిని మెప్పించెను. కొలఁది కాలములోనే యతఁడు గోరీని లోఁబఱచుకొనెను. ఒకనాఁ డతఁడు పాదుసాయంగీకారము నంది బందెలోనున్న తన చక్ర వర్తిని దర్శింపనేగెను. అతనినడకచప్పుడు విని పృథ్వీరాజు "ఎవ రావచ్చువారు" అని పల్కెను. ఆతనిని జూచుటతోడనే చాంద భట్టునకు దుఃఖము తలమునుకలయ్యెను. నోట మాట రాదయ్యెను. గద్గదస్వరముతో నతఁడు "రాజశేఖరా నమస్కా రము" అనుచుఁ బృథ్వీరాజును సమీపించెను. మాటవైఖరిని బట్టి రాజతనినిగుర్తించి గాఢాలింగన మొనర్చుకొని మిగులవగచెను. భట్టు పొంగిపొరలుచున్నతనశోకము నెట్టకేలకు దిగమ్రింగి "ప్రభూ! మనకు శుభదినములు సమీపమునందే యున్నవి. చింతింపకుఁ" డని తనరాజు నోదార్చి తానుబన్నినయుక్తి నొకదాని నతనిచెవిలో వైచి యాతావు విడిచిపోయెను.

తదనంతర మొకనాఁడు గోరీ కొలువుదీరి వినోదము కొఱకు సభ్యులతో నాయాప్రసంగములు సలుపుచుండెను. కొంతసేపటికి ధనుర్విద్యనుగూర్చినముచ్చటలు వచ్చెను. ఈ విద్యలోఁ బృథ్వీరాజును మించినవాఁ డింతవఱకుఁ బుట్టలే దని చాందభట్టు పలికెను. గోరీ నివ్వెఱగుపడి "భట్టూ! నిజముగా నతఁ డంత గొప్పవిలుకాఁడా!" యని ప్రశ్నించెను.

"సందేహ మేమి? అతఁ డిప్పు డంధుఁడై యున్నను ధ్వనినిబట్టి సూటిగా బాణము విడువఁగలఁడు. ఈవిద్యను 'శబ్దవేధి'యని యందురు. ఇం దతని కతఁడే సాటి. ఏలినవారికిఁ

కుతూహలము కలదేని పరీక్షింపవచ్చును." అని చాందభట్టు ప్రత్యుత్తర మొసఁగెను. పాదుషా, వెంటనే పృథ్వీరాజును కారా గృహమునుండి సగౌరవముగా సభకు రావించెను. అతనిధను స్సును బాణములను అతని కిచ్చెను. విలువిద్యయందు మీకుఁ గల నైపుణ్యము నించుక చూపుఁడని యాతనిని గోరెను. ఈమాటనూటినిబట్టి పృథ్వీరాజు వింటియం దొక్కశరమ్మును సంధించి విడిచెను. వెంటనే "అయ్యో! చచ్చితిని చచ్చితిని" అని కేకలుపెట్టుచు గోరీ నేలఁ గూలి విలవిలఁ దన్నుకొని యసువులం బాసెను. అపుడే పృథ్వీరాజ చాందభట్టు లొండొ రులు పొడుచుకొని దివి కేగిరి.

ఇట్లు తనయేలిక గౌరవమును గాపాడుటకై ప్రాణ ముల నర్పించిన చాందభట్టు త్యాగము చిరకాలము స్మరింపఁ దగినదిగదా! ఇట్టిప్రభుభక్తిపరాయణులచరిత్రలు సూర్య చంద్రు లుండుసంతవఱకు వెలయు ననుటలో సందేహమేమి?

# దేశభక్తి

## ( రాణా ప్రతాప్ )

పెద్దలయెడఁ జూపు ప్రేమకు భక్తి యని పేరు. ఆ ప్రేమ తల్లిపైఁ గలదేని మాతృభక్తి యనియుఁ దండ్రిపైఁ గలదేని పితృభక్తియనియు గురువుపైఁ గలదేని గురుభక్తి యనియు నందురు. అట్లే దేశముపైఁగల ప్రేమ దేశభక్తియని పిలుతురు. ప్రతిమనుష్యుఁడును బ్రపంచముసం దన్ని వస్తువులకంటెఁ దన ప్రాణము నెక్కువగాఁ జూచుకొనుట మీరు సాధారణముగాఁ జూచుచున్నారు. మహాపురుషులు, తాము పుట్టిపెరిగిన తమ దేశమునకు విపత్తు సంభవించినచోఁ దమప్రాణములుసైతము వదలి దేశమర్యాదను గాపాడుచున్నారు. ఇట్టివారిలో రాణా ప్రతాపసింహుఁడు ముఖ్యుఁడు.

పూర్వము మేవాడరాజ్యమును 'సిసోదియా' వంశము వాఁడైన యుదయసింహుఁడను రాజపుత్రుఁడు పాలించెను. ఇతని కొకకుమారుఁడు గలఁడు. అతని పేరు ప్రతాపసింహుఁడు. ప్రతాపుఁడనియు, రాణాప్రతాప్ అనియు నతనినే పిలిచెదరు.

అక్కాలమున మోగలువంశస్థుఁడైన యక్బరు డిల్లీకిఁ బాదుషాహాగా నుండెను. అక్బరు యుద్ధమునందేగాక రాజనీతి యందును మిక్కిలి నిపుణుఁడు. అతనికి రాజ్యసంపాదనయందు కాంక్ష మెండు. హిందూరాజులలోఁ జేరి యొకరిమీఁది

మాటలు మఱియొకరికిఁ జెప్పి వారిలో నైకమత్యము లేకుండఁ జేసి వారినందఱను దుదకుఁ దనకు లొంగఁజేసికొనియెను. ఈ మాయోపాయమునకు లొంగనిరాజు లేరైననున్నచో వారి పైఁ గత్తికట్టి యుద్ధముచేసి జయించెను. ఎట్లయిననేమి? ఆదినములలో నక్బరుధాటి కెవ్వరు నిలువఁజాలకపోయిరి. కొందఱుభూపాలురు తమరాజ్యములు వదలుకొని యతనికొలువులోనే చేరిరి. కొందఱు క్షణక్షణము సలాములు చేయుచుఁ గానుకలర్పించుచు నతనియాజ్ఞయైనచోఁ దోడిరాజుపైకైనను దాడి వెడలుచుఁ బ్రాణములపైఁ దీపి వదలఁజాలక బ్రతికిరి. కొందఱు తమయాఁడుబిడ్డల నాయక్బరునకును, అతని బంధువులకును సమర్పించి యాతనివలన బహుమానములను బిరుదములను బడిసిరి. కొందఱు మహమ్మదీయమతమునే స్వీకరించిరి. ఇట్టిస్థితిలో మేవాడ్ రాజొక్కఁ డక్బరువలలోఁ జిక్కకుండెను కాని యితని ముఖ్యసహాయులంద ఱతని చేతిలోని బొమ్మలైరి. అందుచే నక్బరు మేవాడ్ రాజ్యము నంతను బలిమిమీఁద తన వశము సేసికొనియెను.

ప్రతాపసింహుఁడు పెరిగి పెద్దవాఁడై రాజ్యముచేయ వచ్చునప్పటికిఁ జేరెడునేల తన స్వాధీనములో లేదు. యుద్ధము చేసి సంపాదించెద మనిన సైన్యమును లేదు. తొలుత సైన్యమును బోగుచేసికొనియెదమనిన బొక్కసములో రాగిడబ్బైనను లేదు. తండ్రి యదివఱకే మరణించెను. ఇఁక నప్పు డతఁ డేమిచేయఁగలఁడు? అమితధనసంపన్నుఁడు, అపరిమితసైన్య

సహాయుఁడునైన యక్బరుతో నతఁ డెట్లు పోరఁగలఁడు? పరితాపసింపవలసిన దిదియే కష్టకాలము. కాని యతఁడు తన పూర్వులయొక్క శౌర్యపరిధానము లయిన కథలను జదువుచు నుత్సాహమును బ్రజ్వలింపఁజేయుచు నరణ్యములో వాసము చేయ మొదలిడెను.

మొట్టమొదట నడవిలోఁ జేరినప్పు డితనికిఁ దోడు భార్యయు బిడ్డలుతప్ప మఱియెవ్వరు లేరు. ఆకాల మీకాల మనక పగలంతయు నెట్టని యెండలోను రాత్రి యంతయుఁ జీఁకటిలోను వెన్నెలలోను గడపెను. మధురములగు భక్ష్య పదార్థముల ననుభవింపవలసిన యఁతడు "కాలుచున్న కడు పునకు మండుచున్న గంజి" యనునటులు కొఱ్ఱలతోడను రాగుల తోడను రొట్టెఁ జేసికొని తినెను. ఇట్లున్నను అతనిమనస్సు నకు శాంతిలేదు. శత్రువులువచ్చి పైఁబడుచున్నారని తెలి యుటతోడనే యున్నతావునుండి భార్యతోడను బిడ్డలతోడను ఆహారపానములు వర్జించి పెక్కుయోజనములు పరుగెత్తవలసిన వాఁడాయెను. ఒకనాఁ డక్బరు "నీవు నాకు శరణుజొచ్చిన నీరాజ్యమంతయు నీకిచ్చివేసెద"నని యితనికి వర్తమాన మం పెను. కాని యీ శూరాగ్రేసరుఁడు "పవిత్రమైన బాప్పా రావల్ వంశమునఁ బుట్టి హీనుఁడనై నే నీపని చేసి నావంశమున కపఖ్యాతి తేఁజాలను. ఇది ముమ్మాటికి నిజ"మని బదులు పంపెను. చూచితిరా? యితనిధైర్యము, సాహసము, పౌరు షము! ఈమాట వినినంతనే కొందఱు రాజపుత్రనృపాలురు

సిగ్గుదెచ్చుకొని తమసేనతోఁ బ్రతాపునకు సాయముసేయ శపథము సేసిరి. ఇప్పటికిఁ బ్రతాపునకుఁ గొంతబల మేర్పడెను మేవాడ్ రాజ్యము సాధింపఁబూనుకొనెను.

తనయొద్దనున్న సేనతో మొగలుల నెదిరింప సాధ్యము గాదని ప్రతాపుఁడు తలఁచి చాటుచాటున విరోధుల రాజ్యమున నుపద్రవము గల్పింప మొదలిడెను. తానున్న 'కుమళ్‌నేర్, గోగుండా' అను స్థలముల గట్టిదుర్గములఁ గట్టి కాఁపుంచెను. పడపడి కొంతసైన్యమును దీసికొని శత్రురాజ్యములోని గ్రామములపైఁబడి దోఁచికొని ప్రజలనందఱ నడవులకు వెడలఁగొట్టెను. ఇట్లు చేయుటచే గ్రామము లరణ్యములయ్యెను. చూచుటకొక్క మనుష్యుఁడైనను గానరాకుండెను. వ్యవసాయము పాడైపోయెను. పైరులకు బదులు పొలములలో నవురుగడ్డి మొదలైనవి సందులేకుండ మొలిచెను. అందుచే నా గ్రామములనుండి వచ్చుపన్నులన్నియు మొగలుప్రభువునకు నష్టమయ్యెను. అంతియె కాదు. అతనికిఁ గావలసిన సీమసరకులన్నియు నీ పాడువడిన గ్రామములమీఁదుగనే గావలసియుండుటచే వానినన్నింటి నొక్కటియైనఁ దనకుఁ జిక్కకుండ బ్రతాపుఁడు త్రోవలో దోఁపిడిదోయించి యపహరించెను. ఇప్పు డక్బరునకుఁ గొంచెము చుఱుకు గలెను.

"తురకలకుఁ బిల్లనిచ్చినవారితో నితరరాజపుత్రులు సంబంధ బాంధవ్యములు చేయఁగూడ"దని ప్రతాపుఁడొక కట్టుఁబాటు సేసెను. అందులకు జయపూర్ జోధపూర్

రాజులు మాత్రము తప్ప మిగిలిన రాజపుత్రులందఱు సమ్మ తించిరి. జయపురమునకు మానసింహుఁడు ప్రభువు. ఈ
ఈ మానసింహుఁడు తన చెల్లెలి నక్బరుతండ్రియైన హుమా యూనున కిచ్చెను. ఇతఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడు. అక్బరునకుఁ గల్గిన మహావైభవమున కంతయు నితఁడే కారణ మని చెప్పవచ్చును. ఒకనాఁ డీతఁ డక్బరునిమిత్తమై దండు వెడలి శత్రుసేనల జయించివచ్చుచు కుమల్ నేర్ దుర్గమున బ్రతాపసింహుఁ డుండెనని తెలిసి యతని జూడఁబోయెను. ప్రతాపుఁ డతని మిక్కిలి గౌరవించెను. భోజనమునకుఁగూడ నా దినము తనయింట నిల్పెను. కాని తురుష్కునకుఁ బిల్ల నిచ్చినవాఁ డగుటచే మానసింహుని పంక్తికిఁ బ్రతాపుఁడు భోజనమునకు రాలేదు. అందుపై మానసింహునకుఁ గోపము వచ్చి భోజనము చేయకయే లేచి 'నన్నుఁబిలిచి యగౌరవించినందు లకు నీకుఁ దగిన ప్రాయశ్చిత్త మగు'నని కన్ను లెఱ్ఱజేసి గుఱ్ఱ ముపై నెక్కిపోయెను. పోవుచున్న యాతనిం జూచి ప్రతాపుఁడు "యుద్ధమునకు వచ్చునప్పుడు నీ మేనల్లునిగూడఁ దీసికొని ర"మ్మని హేళనగాఁ బల్కెను. మానసింహుఁడు ఢిల్లీకిఁ జేరి యీ విషయమంతయు నక్బరునకు గోరంతలు కొండంతలుచేసి చెప్పెను. అక్బరు మిగుల నాగ్రహముఁజెంది తన కొమారుఁ డైన సలీమును, మానసింహుని బెద్దసేనతోఁ బ్రతాపుని మీఁదికిఁ బంపెను.

మొగలు సైన్యమును బ్రతాపసింహుఁ డిరువది

రెండు వేల రాజపుత్ర భటులతో నెదుర్కొనెను. ఇరువురకుఁ గొన్ని యేండ్లు ఘోరయుద్ధము జరగెను. ఈ యుద్ధమున బ్రతాపుఁడు చూపించిన శౌర్యము, ధైర్యము, వీర్యము నైపుణ్యము చెప్పనలవికాదు. వీని పరాక్రమము నిప్పటికిని రాజపుత్రస్థానమునఁ బ్రతియింట జనులు పాటలుగాఁ బాడు చుందురు. ఐనను బ్రతాపున కీయుద్ధమునఁ జివరకు జయము గల్గలేదు. మొగలుసైన్యమును, సలీమును, ముప్పతిప్పలుపెట్టి మూఁడు చెఱువులనీరు త్రాగించినను దుద కితని సేనలోఁ బండ్రెండు వేలు నశించెను. ఇతని దుర్గములు శత్రువుల యధీనములయ్యెను. ప్రతాపునకు మఱలఁ గష్టములు హెచ్చెను. తినుటకుఁ గంచమును బరుండుటకు మంచమును లేని యవస్థ పట్టెను. అట్లున్నను నితఁ డక్బరు శరణు చొరలేదు. కను గొంటిరా? రాజపుత్రుని చిత్తస్థైర్యము. ఈ విషయమున నక్బరుకొలువులోని ముఖ్యులుగూడఁ బ్రతాపుని ననేక విధములఁ బొగడిరి.

ఇంతవఱకుఁ బ్రతాపునకు దైవబలము చాలలేదు. అందుచే నతఁడు విసిగి సైన్యాదులఁ బోగుచేసికొనుటకుఁ గొంతకాలము పట్టునని తలఁచి 'యుద్ధమునకుఁ గొంతవ్యవధి యి'మ్మని యక్బరునకు వర్తమాన మంపెను.ఇది వినుటతోడనే తురుష్కనాధుఁడుప్పొంగి ప్రతాపుఁడు తనకు లొంగెనని తన కొలువుకూటమునఁ బల్కెను. ఈమాట వినుటతోడనే కొలువుననున్న పృథ్వీరాజు లేచి "ప్రతాపుఁడు గొంతున నూపిరి

యున్నంతవఱకు మీకు శరణు చొరఁడు. ఇది సత్యము. మీరు ఢిల్లీపట్టణము కట్టిపెట్టెదమన్నను గాలఁ దన్నును. ఎవరో యతని విరోధు లిట్లు వార్తపంపిరి. నేను నిజము తెలిసికొనెదనని పల్కి తన సేవకునిచేతి కొక లేఖ వ్రాసియిచ్చి ప్రతాపుని యొద్దకుఁ బంపెను. అందులోని విషయము లివి:- "రాణా ప్రతాపసింగ్ జీ! హిందువులగు మేమందఱము మీబోఁటిమహాపురుషులపై నాధారపడి యున్నాము. మీవంటి మహాశయు, లొక తురకరాజును శరణుఁజొచ్చుట కడుంగడు దుఃఖాస్పదము. మీవంశమువా రింతవఱకు రాజపుత్రులలజ్జను స్త్రీల పవిత్రతను రక్షించినారు. ఇప్పుడు మీ రా రక్షణభారము వదలుట భావ్యముగాదు. మేము నీచులమై మాయభిమానమును, మాస్త్రీలపవిత్రతను మొగలుల కమ్ముకొంటిమి. మీరిప్పుడు మమ్ముల నుద్ధరింపవలయును. మీకులమర్యాదను నేఁడు తురకల కమ్మకుడు. మీరిప్పుడు కష్టములో నున్నను మీకుఁదప్పక దైవము తోడ్పడును. లోకమంతయు మీపై నాశపెట్టుకొని యున్నది. మీఖడ్గమే మీకు సాయముచేయును. మీరు శరణనిన లాభములేదు.

ఉత్తరము చదువుటతోడనే ప్రతాపునకుఁ బదివేల సైన్యముల బలము వచ్చెను. వెంటనే మొగలులపై యుద్ధమునకు దూఁకెను. ఈసమయమునఁగూడఁ బాపము! ప్రతాపునకు జయములేదు నిస్పృహఁజెంది యతఁడు పాఱిపోఁ జూచెను. కాని వెంటనే యతనిమనసున కతఁడే బుద్ధిచెప్పుకొని లేని

యుత్సాహమునంతయుఁ దెచ్చుకొని జయమైనను మరణమైనను దప్పక యీ పర్యాయము గలిగితీరవలయునని మదించినయేన్గుల పై దుముకు సింగపుఁగొదమవలె మహమ్మదీయులపై గంతు వైచెను. ఇదే సమయమునఁ బ్రతాపునిపూర్వ మంత్రియగు 'భామాసా' యనువాఁడు తనయజమానుని దురవస్థ తెలిసి తన కున్న ధనము నంతయు నతని కర్పించెను. ప్రతాపుఁడిర్వదియైదు వేల సైనికులతో నీసారి పోరాడెను. దయయనుమాట నీతడవ నతఁడు మఱచి చిక్కిన శాత్రవులనెల్ల నఱకెను. తప్పించుకొని పోవువారినిగూడ వెంబడించి కుత్తుకలఁ గత్తిరించెను. మొదటఁ గుమల్ నేర్ కోటను స్వాధీనపఱుచుకొనెను. అచ్చటనున్న 'అబ్దుల్లా'యను మొగల్ సర్దారును సైన్యములతోఁగూడ నాశము చేసెను. ఇట్లు మిట్టమధ్యాహ్నమునందలి సూర్యునివలె మండిపడుచు నొకటివెంబడి నొకటిగా ముప్పదిరెండు దుర్గ ములు వశముచేసికొనెను. ఒకటిరెండు దుర్గములు దప్ప మేవాడ్ రాజ్యమంతయు నతని స్వాధీన మయ్యెను. తన శత్రువగు మానసింహుని రాజధానియైన జయపురమును బ్రతాపుఁడు సేనలఁ బంపి దోపించెను. అక్బరుమంత్రులంద ఱితని శౌర్య మును బొగడిరి. ఇంకను గొన్నిదుర్గముల నితఁడు జయింపఁ జూచెను గాని కోరికలు దీరకమునుపే మృత్యుదేవత యతని నెత్తుకొనిపోయెను. ఈతని గురించి యప్పటికవులు వ్రాసిన పాట లిప్పటికిని రాజపుత్రస్థానమున నాబాలగోపాలముచేఁ బాడఁబడుచున్నవి.

# జీవకారుణ్యము

## (బుద్ధుఁడు)

జీవులయెడఁ జూపు కారుణ్యమునకు జీవకారుణ్యమని పేరు. కారుణ్యమనఁగా దయ. ఇట్టిదయ మానవులసుగుణములలోఁ బ్రధానమైనది. దయలేని మానవుఁడు దానవుఁడు. అన్ని మతములవారును దయాగుణ మావశ్యకమని చెప్పుచున్నారు. దయావంతులలో బుద్ధుఁడు చాల గొప్పవాఁడు. అతని చరిత్ర పవిత్రమైనది. కావున నెల్లరును దానిం జదువుట యవసరము.

ఉత్తరహిందూస్థానమున హిమాలయపర్వత సమీపమునఁ గపిలవస్తువను పట్టణ మొకటి కలదు. దానిని దాదాపు ఇరువదినాలుగువందలయేండ్లనాఁడు శుద్ధోదనుఁడను రాజు పాలించుచుండెను. అతఁడు శాక్యవంశమున మిగుల వాసి గాంచెను. అతనికి మాయా దేవియు గౌతమియునను భార్య లిద్దఱు గలరు. అందు మాయాదేవి పెద్దరాణి. ఆమె పతిభక్తియందును దైవభక్తియందును బేరుగాంచెను. పేదసాదలయందీమె కాదరము హెచ్చు. ఈనారీమణి కొన్నాళ్ళకు గర్భవతి యయ్యెను. నవమాసములు నిండినవెనుక నొక సుముహూర్తమున దివ్యలక్షణ సంపన్నుఁడగుపుత్త్రునొకని గనియెను. కాని దురదృష్టవశమునఁ బ్రసవించిన యేడవనాఁడే యామె మరణించెను. తరువాత శుద్ధోదనుఁడు బిడ్డకు జాతకర్మాదులు జరిపి

సిద్ధార్థుడను పేరు పెట్టెను. ఆతనిరెండవభార్యయగు గౌతమి సిద్ధార్థుని గన్నబిడ్డవలెఁ బెంచుచుండెను. ఆబాలుఁడు క్రమ క్రమముగాఁబెరిగి యైదేండ్లవాఁ డయ్యెను. అంతట రాజు సిద్ధార్థునకు విద్యాబుద్ధులు నేర్పింపనెంచి మహాపండితుఁడగు నుపాధ్యాయు నొకని రావించి కుమారు నతని కప్పగించెను. సిద్ధార్థుఁడు కుశాగ్రబుద్ధి. కావునఁ గొలఁదికాలములోనే యతఁడు గురువుగారి మనస్సు నాకర్షించెను. సర్వవిద్యలు నేర్చెను. సాము నం దారితేరెను. సత్యము మున్నగు సుగుణము లతని కలంకారము లయ్యెను. అతని నడవడి నెల్లరును మెచ్చుకొనుచుండిరి.

సిద్ధార్థునకుఁ బదియేండ్ల వయస్సు వచ్చెను. ఆటపాటలపై నాతనికి నాసక్తి హెచ్చెను. ఒకనాఁ డతండు దేవదత్తుఁడు మొదలగుచెలికాండ్రతోఁ గూడి యుద్యానవనమున విహరింప నేగెను. అవ్వనము కమ్మని పువ్వులతోడను దట్టమైన పొదరిండ్లతోడను నిర్మలములగు సరస్సులతోడను గన్నులకు విందొనర్చుచుండెను. రాజకుమారుఁడు దానిసౌందర్యమును గాంచుచు సంతోషపరవశుఁడగుచుండెను. అప్పు డాకాశమార్గమున నంచలబారొకటి ప్రయాణము చేయుచుండెను. సిద్ధార్థుఁ డా హంసలను వీక్షించి తన చెంతనున్న మిత్రులకుఁజూపి వాని యందచందములను వర్ణింపసాగెను. ఇంతలో దేవదత్తుఁడు దయాశూన్యుఁడై ధనుస్సునం దొక్క వాడిబాణంబును సంధించి చక్కఁదనాలచుక్కయగు నొక్క హంసను కొట్టెను.

పాప మాహంస వెంటనే విలవిలఁ దన్నుకొనుచు నేలఁ గూలెను. దానిశరీరము రక్తమయమయ్యెను. కన్నులు తేలి పోవుచుండెను. ఈదృశ్యమును జూడఁగనే సిద్ధార్థుని హృదయము కరఁగి నీరయ్యెను. అతఁడాహంసను మెల్లగానెత్తి తనతొడపై నిడుకొని విఱిగినఱెక్కలను సవరించి రక్తమును దుడిచెను. తరువాత సిద్ధార్థుఁ డాపులుఁగు మేనిలో నాటుకొనియున్న శరంబును నేర్పుతో లాగివైచెను. అపు డా హంస తొల్లిటికంటె నెక్కుడుగా బాధపడుచు గిలగిలఁగొట్టుకొనెను. రాళ్లు కరఁగునట్లు రోదనము చేసెను. అంత సిద్ధార్థుఁడు 'అక్కటా! యీ హంసబాధ హెచ్చుటకుఁ గారణమేమి? దీనిశరీరములో గ్రుచ్చుకొని యున్న ములికినిసైతము తీసితినిగదా! బాణమును లాగిన వెనుకనే దీనినొప్పి యధికమైనట్లు తోఁచుచున్నది. ఏమి యీ వింత' అని పెక్కుభంగులఁ జింతించెను. అనంతర మతని కొక యూహ తోఁచెను. వెంటనే యాబాణమును దనతనువునందు గుచ్చికొని కొంతతడ వుంచి మరలఁ బెకలించెను. బాణము శరీరమునం దున్నప్పటికంటె వెలికి వచ్చిన తరువాతనే బాధ హెచ్చయ్యెను. హంసపడుచున్న వేదనకుఁ గారణ మెద్దియో యతనికిఁ దెలిసెను అంత సిద్ధార్థుఁ డా యంచ కష్టదశకెంతయుఁ జింతించి యరటిమొవ్వువలె నతి కోమలముగా నున్న దానిఱెక్కలను మెల్లమెల్లగా కొన్ని పసరు మందులు సంపాదించి గాయములపైఁ బూసెను. ఎన్నియో యుపచారములు సల్పెను. పక్షిప్రాణములు కుదుటఁబడెను.

గాయములతీపు తగ్గెను. హంస ప్రేమపూరితములైన చూపులతో సిద్ధార్థుని మొగమువంకఁ జూచుచుండెను. సిద్ధార్థుని ముఖమున సంతోషము చిందులు త్రొక్కుచుండెను.

ఇంతలో నా మరాళమును గొట్టిన దేవదత్తుఁ డచ్చోటికివచ్చి రాజకుమారునిగాంచి "మిత్రమా! యీ హంసను నేను గొట్టితిని· ఇది నాసొత్తయినది· కావున దీనిని నాకు నొసంగు" మని కోరెను. సిద్ధార్థుఁ డందులకు నంగీకరింపక యతని కిట్లనియెను· "దేవదత్తా ఎంతకఠినకృత్యము గావించితివి. సౌందర్యరాశియై శరత్కాలపు మబ్బుతునుకవలెనున్న యీ యంచను గొట్టుటకు నీచేతు లెట్లాడెను? నీవు నేర్చిన ధనుర్విద్య యిట్టి సాధుజంతువులఁ జంపుట కుపకరించెనా? మేలు! మేలు! పైపెచ్చు నీకు దీనిపై హక్కుగలదని పల్కుచున్నాఁడవు. ఇది పొరపాటుమాట. ఈహంస నీబాణముచేఁ బ్రాణములు విడచునేని నీసొత్తు కాఁగలదు. అట్లు కానినాఁడు నీకు దీనిపై నధికార మావంతయు నుండఁజాలదు. ఉండునని పల్కుట యధర్మము· అనుచితము. అదృష్టవశమున నే నీ ఖగంబును బ్రతికింపఁ గల్గితిని. దీని యాపదను దొలఁగించుటకై యెన్నియో ప్రయత్నములు సల్పితిని. పెక్కుబాధ లనుభవించితిని· కావున నీపక్షిపై నాకే యధికారము గలదు· కాని యిది యితరుల సొత్తు కానేరదు. తదనంతరము దేవదత్తుఁడించుక యాగ్రహించి సిద్ధార్థా! నీమాటలధోరణి విపరీతముగా నున్నయది· ఈధర్మశాస్త్రము నెచ్చట నేర్చితివి! వేఁటలో దెబ్బతిన్న జంతువు చచ్చి

నను జావకున్నను అది వేటకానిదే! దానిపై నితరుల కెట్టి
స్వామ్యము నుండఁబోదు. క్రిందఁబడి లేవలేక యల్లాడుచున్న
యీపులుగును నీవెత్తి తొడపైఁ బెట్టుకొన్నంతమాత్రముననే
నీకు దీనిపై నధికారము రాఁజాలదు. కావున మారాడక
నాహంసను నాకర్పింపు మని పల్కెను.

సిద్ధార్థుఁడామాటలను విని దేవదత్తా! నీవు వృధా కల
హించుచున్నావు. ఉద్రేకమును జెందకుము. అది వివేకమును
సమూలముగా నాశము చేయును. నాపల్కులు నీకు సమంజస
ములుగాఁ దోఁచక పోవచ్చును. ఇంతమాత్రమున వచ్చెడి
ప్రమాదమేమి? ఈధర్మసందేహమును దీర్పగల నేర్పరులు
మన సంస్థానమునఁ బెక్కుమంది గలరు. వారిచెంతకుఁ బోవు
దమురమ్మ'ని దేవదత్తునొడంబఱిచి యతనిని దనవెంటనిడు
కొని రాజసభకుఁ జేరి యందలి పండితులం గాంచి వారిని దనకును
దేవదత్తునకును సంభవించిన వివాదమును బరిష్కరింపుఁడని
వినయపూర్వముగా వేడుకొనెను. అపుడు ధర్మమర్మముల
నెఱింగిన విద్వాంసు డొకం డిట్లనియె.

"లోకమునందలి సర్వజంతువులకును బ్రాణము ముఖ్య
మైనది. దానిని రక్షించుకొనుటకై ప్రాణి యెట్టి త్యాగము
నైనను గావించును. అట్టిప్రాణము నెవ్వఁడు కాపాడునో వాఁడే
దాని కధికారి. ఇందుకు సందేహములేదు. కనికరములేక ప్రాణు
లను హింసించువారికి వానిపై హక్కు సిద్ధింపనేరదు. ఈసిద్ధా
ర్థుఁడు జాలిగుండెతో నీయంచను గష్టదశనుండి తప్పించెను.

దీనిశరీరమందున్నయలుగును లాగెను. గాయములకు మందులు వైచెను. దీని కాహారాదు లొసంగి, తగిన యుపచారములు గావించెను. మృత్యుముఖమునుండి తప్పించి యీపక్షిని రక్షించెను. మరియు వేటలో దెబ్బతిన్న జంతువు ప్రాణమున్నంత వఱకును వేటకానిది కాఁజాలదు. ఈధర్మంబు సుప్రసిద్ధమైనది. కావున నెల్లవిధముల నీహంస సిద్ధార్థునిదే" అని పల్కఁగా రాజును, సభ్యులును ఆపండితుని బుద్ధివిశేషమును సిద్ధార్థునిజీవ కారుణ్యమును వేయివిధంబులఁ గీర్తించిరి. అదిమొదలు సర్వ జనులును ప్రాణిహింస మహాపాపమనినమ్మి జీవకారుణ్యముతో మెలంగ నారంభించిరి. అహింసవంటి ధర్మము వేఱొకటిలేదు గదా?

తదనంతరము సిద్ధార్థుఁ డాయుంచను కడుంగడు గారాబముతోఁ బెంచి ఱెక్కలను గాయ్యలు బాగుపడిన వెంటనే యింటికి వదలెను. అది పరమానందముతో నెగిరిపోయి తన బంధుగులం గలిసికొని సుఖించెను.

సిద్ధార్థుఁడు నిరంతరము నిట్లే పెక్కు సత్కార్యము లొనరించి కొన్నాళ్లకు బుద్ధుఁడై ప్రసిద్ధి కెక్కెను.

# స్వ యం కృ షి

## ( బు క ర్ - టి - వా షిం గ్ట న్ )

మనుజుఁడు పుట్టినప్పటికంటెఁ బెద్దవాఁడగుటకు నాహారము తీసికొనవలయును. అటులనే ప్రతివిషయమునందును అభివృద్ధినొందుటకుఁ గృషిచేయవలయును. ఎవఁడు వృద్ధినొందఁ గోరునో వాఁడు తానే యాహారముఁ గొనవలయును. తానే ప్రయత్నము సేయవలయును. ఇట్టికృషినే స్వయంకృషి యందురు.

మనుష్యుఁడు ప్రయత్నము సేయక యేమియు ఫలము నొందనేరఁడు. ఇంట బియ్యమున్నను వండుకొని భోజనము చేయక ఆఁకలి తీఱనేరదు. నువ్వులలోఁ దైలమున్నను గాను గాడక తీసుకొనలేము. గనులలో నెంతబంగారమున్నను, ద్రవ్వి తీసి, బాగుచేసికొనక లాభము పొందనేరము.

మానవునకు నితరులనుండి వచ్చుసాహాయ్యముకంటె స్వయంసాహాయ్యము మేలైనది. స్వయంసాహాయ్య మున్న వానికే దేవుఁడు సాహాయ్యమొనరించును. ఇట్టి వారిమూలముననే లోక మభివృద్ధి నొందుచుండును. వారిచరిత్రములు మన కవశ్య పఠనీయములు; అవశ్యాచరణీయములు. అట్టి చరిత్రపురుషులలో బుకర్-టి-వాషింగ్టనొకఁడు.

వాషింగ్టను అమెరికాలోని వర్జీనియా రాజధానిలో జన్మించినాఁడు. ఇతఁడు నీగ్రోజాతివాఁడు. నీగ్రోజాతివారి నా దేశములందుఁ గడునీచముగఁ జూచుచుందురు. వారు గ్రామములందుఁ దక్కిన వారితోఁ బాటు నివసింపరాదు. వారితోఁ గలసి తిరుగరాదు. వారుచదువుకొను పాఠశాలలలోఁ జదువుకొనరాదు. ఇంతయేల? వారు మనుష్యులవలె నుండరాదన్న మాట. పశువులవలె నీగ్రోవారిని అమ్ముకొనుటయుఁ గొంతకాలము క్రిందట జరుగుచుండెడిది. కాని కొలఁది కాలమునుండి బానిసవ్యాపార మాఁగిపోయినది. అయినను మిగిలిన పరిస్థితు లింకను బూర్తిగ నశింప లేదు. ఇతరదేశస్థుల యిట్టి యాచారములను విన్నప్పుడు మన కాశ్చర్యముగలుగవచ్చును. కాని మనము మాలమాదిగలను జూచెడి దృష్టి యింతకంటె విశాలమైనదా? వారిని మనము మనుష్యులవలెఁ జూచుచున్నామా? వారు మన యింటిచెంత నిల్లుకట్టుకొని నివసింప నంగీకరింతుమా? మనము భోజనముచేయు గృహమున వారు భోజనముచేయుటకు మన మనస్సొప్పుకొనునా? దీని కంతటికిని గారణము మన యజ్ఞానమేగదా! వారేమి మానవులు గారా! కాని యీ పరిస్థితులను సంస్కర్తలు మార్పఁ బ్రయత్నించుచున్నారు. ఈ క్రూరాచారము లెంత శీఘ్రముగ మాఱిన దేశమున కంత మేలు. 'పశు పక్ష్యాదులను సయితము నీతో సమానముగఁ జూడుము' అని బోధించిన

హిందూమతమునఁ మనుష్యుని సయితము మనుష్యునివలెఁ జూడలేకపోవుట యెంత దౌర్భాగ్యము!

వాషింగ్టను తల్లిదండ్రులు కడుబీదలు. వా రుండునది యొక చిన్నగుడిసె. తండ్రియుఁ దన భార్యాపుత్రుల చెంత నుండుటకు నోచుకొనకపోవుటచేఁ గుమారునిపాలన పోషణ భారమంతయుఁ దల్లిపైన పడెను. ఆమె యుదయమునుండి యస్తమయము దాఁకఁ గూలిపనిలోఁ గడపవలసియుండుటచేఁ బుత్రునిఁ జూచుకొనుచుండు భాగ్యము తక్కువకనుక వాషింగ్టను గాలికిఁ బెరుగవలసివచ్చెను. ఏడెనిమిదేండ్లు పైఁబడిన నాటినుండియు నితఁడును నొక యయ్యాయొద్దఁ బనిచేయవలసి వచ్చెను. రెక్కయాడిననేగాని డొక్క యాడదుగదా!

ఇతఁడు తన యజమానుని యింట పనిచేయుచు నా యింటిబాలురు చదువుకొనుచుండుట చూచుచుండువాఁడు. 'వారివలెఁ జదువుకొనుచున్నచో నెంత బాగుగానుండును' అని ముచ్చటపడుచుండువాఁడు. కాని యేదీ యతని కా యవకాశము! అయినను అతఁ డా పిల్లలు పాఱవైచిన చిన్న చిన్న బొమ్మల పుస్తకములను దీసికొని తీఱికదొఱకినప్పుడు పాఠశాలాగృహద్వారమునొద్ద కేగుచుండువాఁడు. కాని లోనికి పోవుటకు సాహసములేదు. సాహసించినను దరిద్రుఁడగు నీ నీగ్రోబాలుని లోనికి రానిచ్చువా రెవ్వరు?

కొన్నాళ్ళయినతరువాత నితఁడుప్పుబట్టీలలోఁ బనిచేయ

నారంభించెను. ఉప్పుపోగుచేసి పీపాలలోఁబోసి తామునింపిన పీపాలపైఁ దమవరుససంఖ్యను వేయించుకొనవలయును. వాషింగ్టను తమపీపాలపైఁ బ్రతిదినము నొక్కయంకె వేయుచుండుట గాంచి దానిని గుర్తుపట్టి, వేయుట నేర్చుకొనెను. ఇది యతఁడు మొదటనే నేర్చుకొన్న వ్రాఁత. అంతవర కొకయక్షరమైన నతనికి రాదు.

అతనికి జ్ఞానముకలుగుచున్న కొలఁదియుఁ జదువుకొనవలయునను నభిలాషము పెంపొందసాగెను. కనుక నెప్పుడవకాశము దొరకునాయని తహతహలాడు చుండువాఁడు. అప్పుడతఁడు తనతల్లిని బ్రతిమాలి యొకప్రాఁతబాలశిక్ష నెట్టులో తెప్పించుకొనెను. కాని యేమిలాభము? నీగ్రోలలో జదువుకొన్నవా రెవ్వరును లేరు. తెల్లవారియొద్దకుఁ జదువు నేర్పుమని యీతఁడు డరుగలేఁడు. అయినను దీవ్రాభిలాషయున్నవానికి - ప్రయత్నముసేయువానికి చదువురాకపోవునా? అతఁడువిన్న యక్షరములవరుసను బుస్తకమునందున్న వరుసతో జతపరుచుచు నెట్టులో ఒకటిరెండు వారములలో నక్షరములు వ్రాయుటకుఁ జదువుటకు నేర్చుకొనెను.

అప్పటికి నీగ్రోలకు దేశమునఁ గొంత స్వాతంత్ర్యము లభించియుండుటచే వారుచదువుకొనఁదలంచి రాత్రిపాఠశాలలు పెట్టించుకొనిరి. అవి ఆదివారపుఁ బాఠశాలలుగ స్థాపితములయినవి. అందుచే వాషింగ్టనొకరాత్రిపాఠశాలకేగుచు జదువుకొన నారంభించెను. తరువాతఁ బగటిబడులును నారం

భము లయినవి. కాని యాబాలుఁడు కూలినాలిచేయుచుఁ గొంతసంపాదించుచుండుటచే నితఁడు పగటిపాఠశాలకేగి చదువుకొనుట కవకాశము లభింపకపోయెను. అయిన నతఁడు మాత్రము నిరాశచెందలేదు. ఉదయము తాను జేయవలసిన పనులనెల్లఁ దెల్లవారుజాముననే లేచి తొమ్మిదిగంటలకు ముగించుకొని యప్పుడు బడికివెళ్ళువాఁడు. బడివిడచినపిమ్మట సాయంతనము తాను జేయవలసియున్న తక్కుంగలకార్యము నెఱవేర్చువాఁడు

ఇట్లు పరిశ్రమచేయుచు నతఁడు పాఠశాలావిద్యార్థుల లోనెల్ల మిన్నయై యుండెను. అతఁడు కొంతకాలమునకుఁ బిమ్మట నుప్పుబట్టీలలోని పనిమాని బొగ్గుగనులలోఁ బని చేసెను. కొంతకాలము వ్యక్తులయొద్దఁ బనిచేసెను. ఎచ్చటఁ బనిచేయుచున్నను దన లక్ష్యము నేమఱక పాఠశాల యెంత దూరముననున్నను రాత్రులయందేగి చదువుకొనుచు వచ్చుచు నుండువాఁడు.

ఇటులుండఁగా నొకమాఱు దూరమున నొకతావున నీగ్రోల కొరకు యున్నతపాఠశాల యేర్పఱచినట్లు వినెను. వినుటయే తడవుగ ఎంతదూరముననున్నదో తెలియకయే యచటి కేగి విద్యాభ్యాసన మొనరింపవలయునని నిశ్చయించుకొనెను. కాని యతఁ డితరుల సేవలో నియమితుఁడై యుంటచే వెంటనే పోవఁజాలకపోయెను.

తరువాతఁ గొలఁదికాలముననే యతఁడు బయల్వెడలెను. పట్టనమా అతిదూరము. ఐదువందలమైళ్లు. చేతిలో రొక్కము పూజ్యము. అయినను వెనుకాడుట యెఱుఁగఁడు గదా! కాలినడకనే పయనించుచు, నెవరేని యన్నము పెట్టినఁ దినుచు, లేదేని మంచినీటితోడనే యాఁకటిచిచ్చు నార్పుకొనుచు, నేదేని బంతిదొఱకినచో దానిపైఁ గొంత దూరమేగుచు నెట్టులైననేమి నానావస్థలంబడి చిట్టచివర కాపట్టణముఁ జేరఁగలిగెను.

అటఁజేరి పాఠశాలయందుఁ బ్రవేశించి, పాఠశాలాధికారుల యాజ్ఞల నెఱవేర్చుచుఁ గొంతకర్చును దగ్గించుకొనుచు, విద్యాభివృద్ధిచే వారిని మెప్పించి, తనస్కాలమున గొంతకర్చును దగ్గించుకొనుచు నా పాఠశాలావిద్య సమగ్రముగ నభ్యసించెను.

తరువాత నొక కళాశాలయందుఁ బ్రవేశించి యటులే యచటి విద్యనుగూడఁ బూర్తిచేసి తన యిఱువదిరెండవయేట ఎమ్. ఏ. పట్టమును, బహుమానపురస్సరముగ స్వీకరించెను. ఇట్లతఁడు తీవ్రాభిలాషతో, నిరంతర పరిశ్రమతో, మొక్కవోనిపట్టుదలతో విద్యాపాండిత్యమును సంపాదించి, చదువునకు మాత్రమేకాక, సద్గుణములకును బెట్టినదిపేరై, దేశమున నందఱకు నాదర్శపూరుషుఁడై విరాజిల్లుచున్నాఁడు. ఇట్టి ప్రయత్నశీలురు ఫలమునొందుట కబ్బురమా?

విద్యావాసన బొత్తిగా నెఱుఁగని కొందఱకు విద్యార్జనము సేయుట కనుకూలముగా 'టస్కీజీ'లో నొకచిన్న పాఠశాల నారంభింపఁదలఁచిరి. అందులకుఁ దగిన యుపాధ్యాయుఁ డెక్కడ దొరకునాయని గాలించి చివరకు మనవాషింగ్టను నా పదవిని నిర్వహింపఁగోరిరి.

వాషింగ్టనుగూడ ధనార్జనము ప్రధానముగా నెంచుకొని సరకారు నౌకరీలకును, అధికారుల యనుగ్రహమునకును ధనవంతుల ప్రాపునకును బాటువడువాఁడు. విద్యాప్రాప్తికి బాటువడవలయునని యతని తలంపు; కాన నాబడి నారంభించెను. ప్రారంభమునందా పాఠశాలావిద్యార్థులు పన్నిద్దఱు మాత్రము. అయినను వాషింగ్టను పట్టుదలవలనను, బోధన నైపుణ్యమువలనను, సద్గుణముల వలనను, ఆపాఠశాల ప్రజాదృష్టి నాకర్షించినది.

కొలఁది కాలమునకే విద్యార్థు లెక్కువగాఁ జేరసాగిరి. ఉపాధ్యాయుల యవసరము పెరిగెను. కనుక నతనికి సహాయులుగా నుపాధ్యాయులు చేరుచువచ్చిరి. ఆపాఠశాలా పోషణమునకై ధనవంతులు దానములు చేయఁబూనిరి. సరకారువారు ధనసహాయ మొనర్ప నారంభించిరి. ఇట్లు క్రమక్రమమున నా పాఠశాల యొక కలాశాలయయినది. దానికధ్యక్షుఁడు (ప్రిన్సిపాలు) మనవాషింగ్టనే.

# స్వయంకృషి

ఆకలాశాలయందు జదువునకు మాత్రమేగాక చేతిపను లకును బ్రాధాన్యముగలదు. కనుక నమెరికా దేశములో నత్యున్నతదశలోనున్న విద్యాశాలలలో నదియొకటి. దాని యం దిప్పుడు వేలకొలంది విద్యార్థులున్నారు. సేవకులుగాని, యుపాధ్యాయులుగాని దరిదాపుగ మూడువందల మంది యున్నారు. ఆవిద్యాలయమునకు గొన్ని వేలయకరముల పొలమును, గొన్ని వందలకోట్ల రూపాయల విలువగలయాస్తి యు నున్నది. పెక్కు రాజ్యములనుండియేకాక యితర ఖండ ములనుండియు నక్కడ జదువుకొనుటకుఁ బోవుచుందురు. వా షింగ్టనింకను దానికై తనశక్తిని ధారపోయుచునేయున్నాఁడు.

విద్యార్థులారా! ఇంతమహాకార్యమును నెఱవేర్చుచున్న యాతఁ డెవరో తెలియునా? కూటికి గుడ్డకు లేక కూలినాలి చేయుచు రాత్రిపాఠశాలలలో నెట్టులో త్రిప్పలు పడుచు బట్టుదలతోఁ బ్రయత్నము చేసిన యాదరిద్రనీగ్రోబాలుఁడే సుమా?

# సత్యము

## ( అబ్దుల్ ఖాదర్ )

సత్యము సర్వశ్రేయము. సత్యమువలననే సమస్తపుణ్యములు లభించును. సత్యముదప్పినవానికిఁ గీఁడెన్నఁడును రాదు. వేయియశ్వమేధములను జేసినఫలమైనను ఒక్కసత్యము సమానముగాదు. సత్యమువలననే శాశ్వతమైన సుఖములు గల్గును. ఎల్లప్పుడును సత్యము పలుకువానిని భగవంతుఁడు ప్రేమించును. వానికి మోక్షమునుగూడ నిచ్చును. అసత్యము మహాపాపము. పరియాచకమునకైన నబద్ధము పల్కరాదు. అసత్యవాదిని భగవంతుఁడు నరకమునఁ దోయును. సత్యమే వ్రతముగాఁగల మహాపురుషులచరిత్రము లెన్నియో మనగ్రంథములఁ గలవు.

'అబ్దుల్ ఖాదర్' అను మహమ్మదీయబాలుఁ డొకఁడు. అతనిచిన్ననాఁటనే తండ్రి మరణించెను. అతనితల్లి యతని నెంతయో గారాబమునఁ బెంచెను. కాని తండ్రిలేని యా బిడ్డకుఁ జిన్నవయస్సుననే ధనము సంపాదింపవలసిన యక్కఱ పట్టెను.

అతనిగ్రామమున నొకవర్తకసంఘము గలదు. ఆసంఘమప్పుడప్పుడు విదేశములకుఁ బోయి వ్యాపారము చేయుచుండెడిది. ఒకనాఁ డా సంఘమువారు పరదేశములకుఁ

బయనమగుట యెఱింగి యబ్దుల్ ఖాదర్ తానుగూడ వారితోఁ బోఁదలంచెను. ఈ విషయము తల్లి యెఱింగి కుమారుని బిలిచి తనప్రక్కను గూర్చుండఁబెట్టుకొని కన్నుల దుఃఖము పొరలి వచ్చుచుండ "నాయనా! దురదృష్టవశమున మీతండ్రి చనిపోవుటచే నింతచిన్నవయస్సుననే ధనసంపాదనభారము నీమీఁద బడినది. ఆఁడుదాననగు నే నేమియుఁ జేయఁజాలకున్నాను. నీవిప్పుడు విదేశములకుఁ బోవుచున్నావు. మార్గమున నెన్ని కష్టములనో దాఁటవలసియున్నది. పరదేశములకుఁ బోయిన వారు ప్రాణములతోఁ దిరిగవచ్చుట దుర్ఘటము. పదునాలుగేండ్లు అల్లారుముద్దుగా బెంచిన నిన్నిప్పుడు వీడవలసివచ్చెఁ గదాయని దుఃఖమున నాకడుపు తఱుఁగుకొనిపోవుచున్నది. నా కన్నతండ్రీ! యిప్పుడు గాకున్న భగవంతునియొద్దనైనను మనమిర్వురము గలసికొనఁగలము. నీకుఁ గావలసిన యక్కఱలు దీర్చుకొనుటకై నలువది రూప్యములు నీ కప్పుకొనెడి బొంతయం దిమిడ్చి కుట్టితిని. సుఖముగాఁ బోయిరమ్ము. పరమేశ్వరుఁడు నీ కన్నివిధములఁ దోడగునుగాక. కాని కుమారా! నా కొక యభిలాష గలదు. ఎట్టి యపాయస్థితియందైనను నీవు సత్యమునే వచింపవలయు" ననెను. అబ్దుల్ ఖాదర్ "అమ్మా నీమాట నే నెన్నఁడును జవదాఁటువాఁడను గాను. పోయివచ్చెదను సెలవిమ్ము" అని తల్లికి నమస్కరించి వర్తకసమూహమును జేరెను.

వర్తకులతో నబ్దుల్ ఖాద రెన్మిది దినములు సురక్షిత ముగాఁ బ్రయాణము చేసెను. తొమ్మిదవ దినమున వా రొక ఘోరాటవిని బ్రయాణముచేయుచుండిరి. మార్గమధ్యమున దారి దోపిడికాండ్రు వారి కెదురైరి. బేహారులు పరువెత్తఁజూచిరి గాని దొంగలు వారివెంటఁబడి కలధనమంతయుఁ దోఁచుకొనిరి. అబ్దుల్ ఖాద రొక్కఁడు మిగిలెను. చివరకు దొంగలు వానియొద్దకుఁ గూడ వచ్చి చుట్టుముగ్రమ్మిరి. అందొకదొంగ యాబాలునిజూచి "ఓరీ! నీయొద్ద నెంతధన మున్నదో? నిజము చెప్పు" మనెను. అందుల కాకుఱ్ఱఁడు " నాయొద్ద నల్వదిరూఁపాయలు గల " వనెను. అందుల కా తస్కరుఁడు "ఏమిరా? పలువా! మాతో నెగతాళి యాడుచుంటివా? నీయొద్ద నేమి? నల్వది రూప్యము లుండుటేమి? నిజము చెప్పు" మనెను. అతఁడు ' నా యొద్ద నిజముగా నల్వదిరూకలుండె' ననెను. ఆ మాట లాదొంగ విశ్వసింపలేదు. ప్రక్కనున్న మఱియొకఁడు "ఓరీ! నిన్నిప్పుడు చంపుమనెదవా? నిజము చెప్పెదవా? నీయొద్ద నెంతధనముండెనో చెప్పు"మని కన్నులెఱ్ఱఁజేసి బెదరించియడిగెను. అబ్దుల్ ఖాదర్ కొంచెమైనను జలింపక 'నాకప్పుడు బొంతలో నల్వది రూపాయలు నిశ్చయముగా గల' వనెను. అంత నతఁడు మిగిలినవారిం జూచి 'వీఁడు నిజముచెప్పునటుల దోఁచుటలేదు. మన సర్దారు నొద్దకుఁ దీసికొనిపోయి తగిన శిక్ష వేయించెద' మని పల్కి వానిం దోడ్కొనిపోయెను.

చోరులు సర్దారునెదుట నబ్దుల్ ఖాదరు నుంచిరి.

సర్దారు ఖాదరును జూచి 'ఓరీ నీకింత పొగరేల? నీయొద్ద ధన మెంతగలదో చెప్పు మనెను. అందులకు బాలుఁడు నాయొద్ద రూఢిగా నల్వదిరూపాయలు గలవు. అవి యీబొంతలోనమ ర్పఁబడియున్నవి. ఈవిషయమిదివఱకే మీభటులకుఁ జెప్పితి' ననెను. సర్దారు 'మీరితనిబొంత విప్పి చూడుఁ' డని దొంగల నాజ్ఞాపించెను. వా రట్లుచేయ నందు నల్వది రూపాయలు వాస్తవముగాఁ గనఁబడెను. సర్దారు పిల్లవాని సత్యమునకు మెచ్చుకొని దగ్గఱకుఁబిల్చి 'నాయనా! ఇంతచిన్నతనములోనే నీకీ సత్యప్రీతి యెట్లలవడెనని యడిగెను. ఖాదర్ "సర్దారూ ఇది మాతల్లియాజ్ఞ" యని యంతయుఁ జెప్పెను. సర్దారునకు వెంటనే మనస్సుమాఱిపోయినది. దారిదోపిడితనముమహాపాప మని హృదయమున నాఁటినది. అతఁడు ఖాదరుచేయి పట్టుకొని 'అబ్దుల్ ఖాదర్! నీవే నాకు గురుఁడవు. నీవలన సద్బుద్ధినేర్చు కొంటిని. ఇఁకనాదుర్మార్గచింతనమును మానివేసెదను. గొంతుపై కిఁగత్తివచ్చినను నీవలెనే సత్యమే పల్కెదను. నిన్నుఁ గష్ట పెట్టినందుకు క్షమింపు'మని యతనికిఁ గొంతధనమిచ్చి పంపెను. తోడిదోపుకాండ్రును సర్దారును జూచి "ప్రభూ! నీవలెనే మేమును బుద్ధి మార్చుకొంటిమి. ఇదివఱకు దుర్మార్గమున మా కెట్లు నాయకుఁడవు గానుంటివో యిప్పుడు నట్లే సన్మార్గమున నాయకుఁడవుగా నుండుమని" ప్రార్థించిరి. అది మొదలు వారందరు ఋషులవలె జీవనములఁ గడపిరి.

